# మోహన

(సాంఘిక నవల)

---

గ్రంథకర్త.

బూదూరు రామానుజులు రెడ్డి,
ఆంధ్రోపాధ్యాయుఁడు,
బోర్డు హైస్కూలు, తిరుత్తని.

---

పీఠికకర్త.

గౌరవనీయులగు దివాన్ బహదూరు
బొల్లిని మునిస్వామినాయుఁడుగారు,
చెన్నరాష్ట్ర ప్రభుత్వ ప్రధానామాత్యులు.

---

రామా అండ్ కో.,
విద్యావిషయప్రచారకులు,
ఏలూరు.

1931.

 [వెల 0—8—0]

ఈ కృతి

సంఘసంస్కరణోద్యమాభివృద్ధికై
పాటుపడు
సంస్కరణాభిమానుల కెల్లరకు
వినయ పూర్వకముగ
సమర్పితము.

గ్రంథకర్త.

# తొలిపలుకు.



నవలావాఙ్మయము ఆంధ్రులకుఁ గ్రొత్త కాదు. పింగళి సూరనకాలమున నుద్భవించిన, యీయమూల్య నవలావాఙ్మయము నేడు వివిధశాఖాపుష్ప ఫలవిరాజితమై యొప్పుచు సారస్వత రసాస్వాదులకు నిరంతర ఫలప్రదాయినియై యొప్పుచున్నది. కాని తెలుఁగు సారస్వతప్రపంచమున సామాన్య జీవితములఁ బ్రతిఫలింపజేయు సాంఘిక నవలలుమాత్ర మెక్కుడుగ గాన్పించుటలేదు. ఒక్క నవలా ప్రపంచమునందేగాక కావ్యలోకమునగూడ నిట్టిలోపము ప్రాధాన్యముగ గన్పట్టుచునే యున్నది. మధ్యయుగమున పరిణామమొందిన హిందూ సంఘాచార విహారములిందుల కొకవిధముగ హేతుభూతములైనను మనపూర్వికుల జీవనాధారముగూడ నొకవిధముగ కారణప్రదము గాకపోదు. వ్యక్తిస్వాతంత్ర్యము, సమిష్టిప్రాముఖ్యత, మనదేశమున నిప్పుడిప్పుడే గమనింపఁ బడుచున్నది. దేశ సౌభాగ్యమునకు సామాన్యప్రజలే బాధ్యులను యుత్కృష్ట సూత్రముగూడ నిటీవల ప్రాముఖ్యదశను వహించినది. ఒకానొకదేశపు ఉచ్ఛనీచదశలు జనసామాన్యపు "నాగరికత" మీఁదనే యాధారపడి యుండునను విషయము పండితులకు సువిదితము. అట్లుండియు నీయుత్కృష్ట సూత్రమును వదలి

"పాడినదే పాట" గ నాంధ్రకవులందఱును, సామాన్యాతీత జీవనములనే వర్ణించుచు నూతనపథమును ద్రొక్క నేరకుండిరి. ప్రతిదినము మనకండ్లయెదుట నగపడుచున్న విషయములను సృష్టించు వాఙ్మయమింకను నెంతయో నభివృద్ధి జెందవలసి యున్నది. ఈ యాదర్శమునకు శక్తికొలది సేవసల్పిన శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారి దృష్టిపథమెంతయు ప్రశంసా పాత్రము.

మిత్రుడగు బూదూరు రామానుజులు రెడ్డిగారిని చిన్న ప్పటినుండియు బాగుగ నేనెరుంగుదును. మామండలమున మొట్టమొదట ఆంధ్రజాతీయోద్యమ వాతావరణము వీచి నప్పుడందు గొట్టుకొనిపోయినవారిలో నీగ్రంధకర్తగారొకరు. వీరు ముఖ్యముగ స్వయంకృషిచే బ్రయోజకులై యుద్యుక్త ప్రయాసములచే గ్రంధకర్తృత్వమును బడయగలిగినందుల కెంతయు సంతసము వొడమెడిది. వీరిదివరకు రచించిన "రత్నాబాయి" "వీరగాంధర్వము" మున్నగు నవలల యందుగూడ పూర్వోదాహృతమగురీతిని సాంఘిక సమస్య లకే ప్రాధాన్య మొసగుచుండిరి. "రత్నాబాయి" యందు వరకట్న పిశాచము సామాన్యజనము నెట్లువీల్చి పిప్పిజేయు చున్నదో చక్కగ నిరూపించిరి. "వీరగాంధర్వము"న వైవా హిక జీవనోత్కృష్టతను జాటుచు, ప్రేమతత్వము నొక్కరీతి

వెల్లడించి సాంఘికాదర్శమును జూపిరి. ఈ "మోహన" యందాధునిక సాంఘిక ప్రపంచమున "చెదపురుగు" వలె స్వేచ్ఛావిహార మొనర్చుచున్న "వ్యభిచార" జీవనపు నైచ్యతను ప్రదర్శించుచు, సంఘసంస్కర్తలకు తోడ్పాటొసంగిరి. తార్పికాంద్రవ్యక్తి నాశనము, అచ్యుతరావు దూరదృష్టి రాహిత్యము ప్రబోధజనకములేయగును. ఈచిన్నికథ విద్యార్థి బృందమునకేగాక సంఘసంస్కారోద్యోగుల కందఱికినిగూడ నుపయుక్తము గాకమానదు. అందందు సందర్భోచితముగ గ్రంధకర్త పొందుపఱచిన యుద్బోధనలు జాతిరత్నములై వారికిగల గాఢమగు సంఘ సంస్కరణాభిలాషను విశదము జేయుచున్నవి.

మన చెన్నరాజధాని యందాచరణకు గొనిరాబడు చున్న దేవదాసిచట్ట మఖిలభారతదేశమందును వర్తింపజేయ వలయునను యాందోళన యొకటి బయలుదేఱినది. హిందూ సంఘము సాంఘికౌన్నత్యమును బడయవలయునన్న నీచట్ట మెంతయు తప్పనిసరి యగుచున్నది. ఇట్టి సదుద్యమమున కుప బలముగ ప్రజాభిప్రాయమును సృష్టించుట కిట్టి గ్రంధము లెంతయు నవసరములు. అందునను ఆందోళనాపూరితమగు నీసమయపు వాతావరణమున నీగ్రంధపుష్పము పరిమళించుట సమయోచితమగు సమయస్ఫూర్తిగ గన్పట్టుచున్నది. ఈచిన్ని

నవల నాంధ్రలోకము సాదరముతో మన్నించునని నమ్ముచు శ్రీ రెడ్డిగారిట్టి గ్రంథము లింకను పెక్కులు విరచించుటకు శక్త్యుత్సాహముల గల్పించి మనుచుటకు సర్వమంగళ ప్రదాతయగు నాభగవాను నర్థించుచు నామనఃపూర్వకమగు నాశీస్సుల నీగ్రంథకర్త కొసఁగుచున్నాను.

కింగ్స్టన్, కీల్పాకు,
చెన్నపురి.
12—12—30.

(Sd.) బొల్లిని మునిస్వామినాయుఁడు.

ఓం.

# అవతారిక.

ప్రాచీనవాఙ్మయ ప్రపంచమునందు గద్యపద్య ప్రబంధములెట్లు బయలు వెడలి విలసిల్లి యుండినవో యదేరీతిగ నేటి నవయుగవాఙ్మయ ప్రపంచమునందు నవలాగ్రంథరాజములు వెలువడుచున్నవి. ఈ నవలలయందు, అపరాధపరిశోధకములు, చరిత్రవిషయకములు, సాంఘికములు మొదలగు పెక్కుజాతు లేర్పడుచున్నవి. అపరాధ పరిశోధకముల వలన పాఠకునకు హృదయానందము గలుగుట మాత్రమేగాక, రచయితమేధాశక్తియు నద్వితీయముగ బ్రదర్శింప జేయుచుండును. చరిత్రాత్మకములవలన జాతీయవ్యక్తిత్వము అప్పటిదేశకాలపరిస్థితులు ప్రకటీకృతములై తమ పూర్వుల చారిత్రములను స్మృతిపథమునకు దెచ్చుచుండును.

ఇంక, సాంఘికములగు నవలలన్ననో, యయ్యవి ప్రతివిషయమునందును బనిసేయగలవు. మత, సాంఘిక, రాజకీయ జాతీయపద్ధతులన్నియు సాంఘికనవలలయందు ప్రస్ఫుటములై, తన్మూలమునఁ గొంతవఱకైనను సంఘమును సంస్కరింప జేయుట కుపకరించుచున్నవి. అట్టి సముద్దేశముతో సాంఘికమును—అందు జాతీయమును—అగు "మోహన" అను

నీ చిన్ని సాంఘికనవల నాద్వితీయప్రచురణమగు "వీరగాం ధర్వ"మను చరిత్రాత్మక నవలకు పూర్వమే నేటికి తొమ్మిది వత్సరములక్రితము నాచే రచింపబడి కారణాంతరముల వలన ముద్రణావకాశము లభింపకుండినను, ఇప్పటికైనను ఆంధ్ర మహాజనుల సమక్షమునందీ గ్రంథమికుభాగ్యము గలిగినందుల కెంతయు సంతసింప వలసియున్నది.

ఈగ్రంథమందలి కథానాయకుఁడువిద్యార్థియగు అచ్యు తరావు ఉజ్వలకర్తవ్య నిష్ఠాపరుఁడయ్యు, తార్పుకాడగు సీతా రామచంద్రునికివశ్యుఁడై వారవనితయగు మోహనకుఁదాసుఁడై అమూల్యమగు విద్యాధనమును మాత్రమెగాక, తనయావ దాస్తియుఁ బోగొట్టికొని ఫకీరై, తుదకు కులశేఖరమను మిత్రునిచే నుద్ధరింపఁబడి సంఘసంస్కర్తయై విలసిల్లినట్లు కథా విధానముఁ జిత్రింపబడి యున్నది. విద్యార్థులు మాత్రమేగాక, రాజులు, జమీందారులు, రైతులు, వర్తకులు, ఆచారపరులు వేయేల ! అందరుగూడ వేశ్యాలంపటత్వమునఁబడి యల్లాడి పోవుచు సంఘము నాశమైపోవుచుండుటచే, దేవదాసి చట్ట ములు, వ్యభిచార నిర్మూలనచట్టములు, సంఘ సంస్కరణ సభలు, ప్రబోధములు, పత్రికాప్రచురణములు మున్నగు పెక్కురీతుల సంఘ సంస్కరణోద్యమము సాగింపఁబడుచుండు నీ సమయమున ఒక్క విద్యార్థులకుమాత్రమేగాక, దేశీయ

లందఱికి నుపకరించునను తలంపుతో వ్రాసిన నీ గ్రంథమిప్పుడు ముద్రణమగుట యుక్తమని నాయాశయము.

"ప్రమాదోధీమతామపి" అను నార్యోక్తిచొప్పున ఈ గ్రంథమందలి రచనావిధానము నందేమి, పద ప్రయోగము లందేమి, తదితరములగు భాషానియమములందేమి దొరలిన లోపములను గుణగ్రహణ పారీణులగు విద్యార్థులెల్లరు క్షీర నీరన్యాయమున మన్నించి ఆదరింతురుగాక యని సాంజలి బంధముగఁ బ్రార్థించుచున్నాఁడను.

మఱియుఁ దమకుగల పెక్కు కార్యావసరములలో వీలుగలిగించుకొని గ్రంథమును సాకల్యముగ జదివి "తొలి పలుకు" నొసఁగిన చెన్నపురిరాష్ట్ర ప్రభుత్వ ప్రధానా మాత్యులును, గురుతుల్యులును నగు గౌరవనీయులు శ్రీయుత దివాన్ బహదూరు, బొల్లిని మునిస్వామినాయుఁడు గారికిని, ఈగ్రంథ ముద్రణభారమంతయుఁ దమపైబూని యవ్యాజమగు ప్రీతిపురస్సరంబుగ నాకుఁ బ్రోత్సాహము గలిగించిన విద్యా విషయ ప్రచారకులును ఏలూరు రామా కంపెనీ యజమానులును నగు శ్రీయుతులు, ఈదర వెంకయ్యపంతులుగారికిని నాహృదయపూర్వక నమోవాకంబు లర్పించుచున్నాఁడను.

| | |
|---|---|
| తిరుత్తని; 19—12—'30 | విధేయుఁడు, బూదూరు రామానుజులురెడ్డి. |

శ్రీరామచంద్ర.

# మోహన

ప్రథమతరంగము

ఉరగము ముట్టినా నరుల కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు రధికంబుగ నాయతమే చకోత్పల
స్ఫురణవహించి వక్రగతిఁ బూనిన మానినిచూపు సోకినం
బురుషున కెందుమందులును బొందవుపొందరు వెజ్జులెవ్వరున్.

భర్తృహరి.

సాయంసమయమగుచుండెను. మందపవనమానందదాయకముగ వీవదొడంగెను. వినీలాభ్రపథ ప్రతిబింబమోహనఁ దరంగసంకలితసాగర మతిమనోహరముగ దృశ్యమగుచుండెను. తత్తీరస్థ విమల పులిన ప్రదేశమున కరుదెంచి ప్రకృతి విచిత్రవిలీనహృదయులగు వారి జన్మములు ధన్యతమము లగునట్లు ప్రకృతిశోభిల్లుచుండెను. ఇంతలో మేఘశకలము లొక్కొక్కటిగ లేచి తీక్ష్ణకరముల నిప్పులను విరజిమ్ముచున్న సహస్రకరు నావరించి, యాతని ప్రతిభ నడంచెను. అట్టిసమయమున-

నట్టి ప్రశాంతవేళను- నట్టి విశ్వమోహన సంధ్యాకాలమున- చెన్ననగరమందలి రాజధానీ కళాశాలకు దవ్వునఁ దూర్పు దిశయందు "బీచ్" యొద్దున నిసుక పఱ్ఱయందొక వ్యక్తి యేదియో యాలోచించుచు నవనత వదనుఁడై యిటునటు దిరుగుచుండెను. ఎట్టకేల కాతఁడేమి స్థిరపరచికొనియెనో గాని రాజధానీకళాశాల వెంబడి వచ్చి మెరీనారోడ్డునం గలసికొని సముద్రపుగట్టునకు రాగలదారి ననుసరించి యొక ప్రదేశమున పద్మాసనమువైచికొని కూర్చుండెను. ఆతని వేసముం జూచిననాతఁడొక గౌరవకుటుంబమున జనించినవాఁడుగఁ దోఁపకమానడు. దేహచ్ఛాయ నేరేడుపండు రంగును మీఱియుండెను. అతని యొద్ద విలువగల యాభరణములేవియు లేకుండినను మాన్చెంస్టరు మల్లునొక దానిని గట్టుకొని, మక్మల్ చొక్కా తగిలించుకొని పైన యారణిపంచెను వల్లెవాటుగ వేసికొనియుండెను. తల క్రాప్ చేయఁబడి ముంగురులు వలయాకారముగ నున్నగ దువ్వఁబడియుండెను. ఆతనింజూచిన ప్రతివారు నతఁడేదోయొక నియమితకార్యము సాధింప సమకట్టినట్లనుకొనుట వింతగాదు. ఆ వ్యక్తి యల్లే పదినిముషము లాప్రదేశముననే కూర్చుండి తనలో నిట్లు తలపోసికొనుచుండెను. ఏమీ! నాకీదురంతచింత! ఎన్నికొంపలగి నాశముచేయుదును? ఈ వఱకే శతమునకు సగభాగము పూర్తి చేసితిని. ఇంకను నాజీవితమం దాయర్ధభాగముఁ గూడ సరిపుచ్చవలసివచ్చునుగాఁబోలు. ఛందువంటి

కాపురములు పాడుజేసి విద్యానిధులై ప్రపంచమునకు వెనుక నెంతయో సేవఁజేయఁగల యువకులగు విద్యార్థులనయితము నాశమొనర్చి పొట్టఁబోసికొనుటయె నాకు నిత్యకృత్యమయ్యెగదా? అటుగాకున్న వారవనితలకు దాసుఁడనై తాత్కాలిక కామోపభోగములకుఁ, బరద్రవ్యములకు నాసించి కుంటెనకత్తెలకు విటులంగూర్చిపెట్టు నుద్యోగమునకుఁ బూనుకొందునా? దాదాపుగ నీవృత్తి నవలంబించిన నాలుగువత్సరములకె కొన్ని వేలార్జించితిని. ఔరా, నాయార్జనము! వారిమాయోపాయములు! పోనీ- వారవిలాసినులాధనమునఁ గాసైన నాకు దక్కనిచ్చిరా? అంతయు మరల వారివాతయేగదా కొట్టుకొనిరి. నేఁడుదయమునుండియు కాఫికబ్బున కేగుదమన్నను జేత నొక రూకయైనను లేక యింతదనుక నాలుక గుంజుకొని చావవలసినట్లు దటస్థించెగదా!

ఛీ మందబుద్ధీ! నీకెందులకీ శృంగనీతులు? నీతిమార్గాన్వేషణము గావించియేనా యీరోజంతయు దినన్నము లేక పస్తుపడియుండుట? భగవానుని చేఁత లిట్లుండ నాజీవితముంగూర్చి నేనింతగవిమర్శింపనేల? కాఁగలకార్యములు కాకమానవు గదా! ఏదోయొక విధముగ బి-ఎ, బి-ఎల్, పరీక్షలయందో అథమము స్కూలు ఫైనల్ వఱకో చదివియుండిన నాకి వ్యాపారమెందులకు గలుగును? మాతృభాషయగు నాంధ్రమునందైనను గవీశ్వరుఁడనుగాక, రాజకీయ భాషయగు నాంగ్లమునం దేఫోర్తుఫారమువఱకో తక్కిరబిక్కిరిగఁ జదివిన దోషముననేగదా పరధనాపహారిణులగువారం

కాంతల వలపుఁజూపులకుఁ గుఱియై శివములెత్తి యాడుచుండు పురుషులకు మధ్యవర్తియై యల్లాడుచుండుట. ఏల– నాకు మతి చెడిపోయినదా యేమి? అల్లాటమేమున్నది? నిన్నటియాబేరము సరిపడిన నాకీనాఁడు కొన్ని వందల రూప్యములకు దక్కువ యుండదుగదా? ఈచెన్నపట్టణమున నెందరో న్యాయవాదు లుత్తమపరీక్షలయందుఁదేరి న్యాయశాస్త్రకోవిదులుగనున్నను నింటి యద్దెలకైన సంపాదించుకొనంజాలక వేలము వెఱ్ఱులై దేవులాడుచున్నారే. నావ్యాపారమట్టిదా? ఒక్కొకమారు వందలకొలఁదిగ గంటకే సంపాదింపగలనుగదా. ఈ దినమున గూడ నొక పెద్దమొత్తమునే సంపాదింపగలను. ఇటు విటుల యొద్దను, నటు విటస్త్రీలయొద్దను నుడ్డలుడ్డలుగ లంచములఁ దీయునాకేమికొదువ! నేనివ్వవలసిన మొత్తముగాక "స్పెన్సరు కంపెని" యందీదిన మధమము నాలుగయిదు బుడ్లయినను మొదటి తరగతి బ్రాంది కొనుటకుఁ బైకమార్జింపక మానుదునా? యని తనయప్పటి సంతోషమాపుకొనఁజాలక పక్కన నొక వెట్టినవ్వునవ్వుచు లేచి యా ప్రదేశముననే యటునిటు దిరుగుచు సాగరతీరమందు విశ్రాంతిఁ గైకొనవచ్చు యువక బృందము నందొక్కొక్కరినిగ విమర్శించి చూచుచుండెను.

---

## ద్వితీయతరంగము.

సూర్యుఁడ స్తమించుటకుఁ గొంతకాలము మాత్రమే యుండెను. సముద్రమందు మత్స్యసముదాయముం బట్టు

నరిగియుండిన జాలరులత్యాతురముగ నొడ్డుఁజేరుటకు దమతమ పడవలం ద్రోసికొనుచు సాగరమందు భీకరాకారముగ గుభుల్ గుభుల్లున నెగురుచుండు నలలం దప్పించుకొనుచు వచ్చుచుండిరి. నానావిధములగు పక్షులు పగలంతయు బయటసంచరించి తమ పిల్లల కెరల సంపాదించుకొని వృక్షాగ్రములందలి తమతమ కులాయములఁ జేరరా నాఁకలిగొనియున్న శకుంతసంతానములు జననీసందర్శనానందపరవశత్వమున నొనర్చు కిలకిలారావములు శ్రవణానందకరముగ నుండెను. అచ్చటి ప్రకృతిసౌందర్యముం జూచు స్త్రీపురుషు లత్యుత్సాహమున నాసాగరతీర సైకత స్థలముల బచారుచేయుచుండిరి. ద్విచక్ర శకటములు (సైకిళ్లు), మోటారుకార్లు, మోటార్ సైకిళ్ళు, గుఱ్ఱపుసారట్లు, ఎద్దులబండ్లు తండోపతండములుగ బుఱ్ఱుబుఱ్ఱున గప్‌గప్పున వచ్చుచు రాజధానీకళాశాలావరణము నానుకొని తూర్పుదెసనుండు మెరీనా రోడ్డు ప్రక్క నిలువబడుచుండెను. ఆబండ్లనుండి దిగినవారందరు సాగరమువంకఁ జేఱి చూచుచు విహారార్థముగ గుంపులు గుంపులుగ వెళ్ళి వారిపూర్వచారిత్రములో, ఆర్యకథలో, మఱి ప్రస్తుత రాజకీయపరిస్థితులో, శృంగారవిషయక ప్రసంగములో గావించుకొనుచుండిరి. శకటారోహణముననే గాక, పాదచారులయ్యుఁ జెన్ననగరమున మారుమూలలనుండువారు సయితము సాగరసందర్శనమున కానాఁడంతయు వచ్చుచునుం బోవుచునే యుండిరి. ప్రస్తుతనాగరకతా మాహాత్మ్య మెట్టిదో తెలిసి

కొనవలయునన్నవారికి బీచిప్రేక్షకసముదాయమే మార్గదర్శకమై నవనాగరికమును కరతలామలకము గావింపఁగలదు. ఆయూరియందు జదువు విద్యార్థిబృంద మానందసాగరమునఁ దేలియాడుచు ప్రత్యక్షసముద్రము పైనుండి వీతెంచు చల్లనిగాలి ననుభవించుచు నాయిసుకతిన్నెలయం దాటలాడుకొను చుండిరి. పగలంతయు నియమితకార్యములం దప్రమత్తులై చరించు మానవాళికిఁ గొంతకాలమయినను విరామ ముండవలయునను కారణమున భగవానుఁడు పారావార పరిసర విహార మొందు గల్పించియుండఁ దమతమ శృంగారములు, మహాదైశ్వములు, యోగ్యతలుజూపించు ప్రదర్శనాస్థలములుగఁ గాఁబోలు భావించి వికారపూరితములగు నలంకారములన్నియుఁ గైసేసికొని దుష్ప్రదర్శనా వేలాపముతో మహిళలును; మనభారతావనియందేమూలను నెన్నడునులేని వక్రభావభరితులై తమ దశకు మించిన చమత్కారములం జూపుచుఁ దప్పదారివి మిట్టిపడు ననంఖ్యాకులగు పురుషులీ పవిత్ర భారతభూమిని పాపభూయిష్టముగ నొనర్చుచున్నారు. చదువరీ,. ఇట్లనుటచే నందరుదెంచుప్రేక్షకులు, ప్రేక్షకరాంద్రందర ట్టివారినిగ భావింపకుము. సద్గుణ గరిష్ఠులగు భారతపుత్రికా రత్నములును, దేశోపకారులును, సత్యసంధులునగు పురుషపుంగవులును, భావికాలమున దేశముక్తికై పాటుపడఁగల ధీమంతులగు విద్యార్థులును నాయెడ కరుదెంచి ప్రకృతిశక్తిని తమయందు లీనముగావించు

కొనువారు వారిలో నల్పసంఖ్యాకులు. అట్టిసాయంసమయము ననే "తిరువల్లికేణిపైక్రాఫ్ట్సురోడ్డు" వెంబడి సుమారిరువది రెండు వత్సరముల వయస్సుగల యువకుఁడొకఁడత్యాతురమున బీచివంకకు నడచివచ్చుచుండెను. చిన్నవయస్సును, దృఢకాయమును గలిగియుండుటచే నాతఁడు బిరబిర నడచుచుండెను. ఆరోడ్డున నడచు నితరులు సయితము మనోవేగమునఁబోవు నాయువకు నచ్చెరువుతో జూచుచుండిరి. దేహచ్ఛాయ యెఱ్ఱగనుండి, వచ్చియు రాని నూనూగుమీసములతో ముఖము చంద్రబింబమును బోలియుండెను. పూర్వాచారము ననుసరించి శరీరమందాభరణములు లేకయున్నను నెడమచేతి మణిబంధమున నొక "రిస్ట్వాచియు", కుడిచేతి వ్రేలియందొక వజ్రపుటుంగరమును బ్రేక్షకుల నాకర్షించుచుండెను. ఆధునిక పద్ధతి ననుసరించి క్రాపు సేయఁబడిన తలవెండ్రుకలు వాస్ లైన్ తైలసంపర్కముం బొంది యర్ధచంద్రాకృతిగ దువ్వఁబడియుండెను. హిందూమతానుసారముగ నాతఁడు పుట్టము గట్టుకొనియున్నను నయ్యది సైకిలు కట్టగుటచే నడచుటకేయభ్యంతరమును గలుగనీయకయుండెను. కన్నులుచక్కఁగఁ గనఁబడుచున్నను శృంగారముగ నుండునని తలఁచి కాఁబోలు విలువగల బంగారపుఁ జల్వాజోడు తగిలించుకొని యుండెను. పాదములకు బూట్సు పద్ధతినిగాక ననంతపురపుఁ జర్మపుజోడు దొడుగుకొని యుండెను. ఎడమచేతిలో ఆంగ్లకవిశేఖరుఁడగు

షేక్స్పియరు నాటకకథల ప్రతి నొకటియుఁ గుడిచేతియందు బ్యాటు నుంచుకొని దాని నిటునటు నాడించుచు నడుచుచుండెను. ఈతని వేషభాషలం జూచినవారికిఁ బ్రస్తుత కళార్థుల సహజస్వరూపము వెల్లడియగుననుట స్పష్టము.

ఆతఁడట్లే నడచి సముద్రతీరపు మెరీనారోడ్డువద్ద బీచిని గలసుకొనెను. ఈతఁడు గూడ దినమంతయు గళాశాలయందు గడపి విశ్రామముఁ గైకొనుటకే సాగరతీరమునకీనాఁడు వచ్చియుండెను. తానట్టె సముద్రతీరమును జేరిన తోడనే యాతనికొఱకు గనిపెట్టుకొని యుండినవాఁడగుటచేఁ గాఁబోలు ప్రథమ తరంగమందు మనకు పరిచయుఁడైన యాతార్పకాడా యువకునిం గని చేరనరిగి గుడీవ్నింగ్ సారనెను. ఆయువకుడట్టె నివ్వెఱపడి చూచుచుఁ దనకిదివరకేమాత్రమును బరిచయములేని యావ్యక్తి యింత చొరవగ బలుకరింప నేమికారణమో యని దలఁచుచు "మీదే యూరండీ?" యని ప్రశ్నించెను. నాయిప్పటి యూరీ చెన్నపట్టణమే యని యావ్యక్తి ప్రత్యుత్తర మిచ్చెను.

యువకుఁడు—"ఇప్పటి యూర నెద రేమి? మున్నే యూరనుండిరి? ఈ యూర నెన్ని దినములుగ నున్నారు? మీ కేమివృత్తి?"

ఈ ప్రశ్నములకావ్యక్తి యట్టె యోచించి మూఁడవ ప్రశ్నను స్మరణ కెంత మాత్రమును దేక "మునుపటి

నాయూరు విశాఖపట్టణము. సుమారు నాలుగైదు వత్స రములుగ నీయూరనుండి మీయట్టి సుగుణ సంపన్నుల స్నేహమును సంపాదించుకొనుచున్నాఁడ " నని జవా బొసంగెను.

యువ—మీ పేరేమి ?

నా పేరు సీతారామచంద్రుఁడని బిలచెదరు.

యువ—ప్రస్తుత మీ పట్టణమునం దేప్రదేశమున నున్నారు ?

సీతా—గోవిందప్పనాయుని వీధియందు.

యువ—నావిషయము, నాయునికి తమకింతకు మునుపెట్లు తెలియును? నన్నింత వాత్సల్యమునం బలుకరించితిరేల ? నా వలనఁ దమకుఁ గావలసిన పని యేదైన నున్నదా ?

సీతా—బ్రదర్- అట్లంటిరేల? మీ వలన నత్యావశ్యకమగు కార్యమొండు గావలసియేగదా యింతఁదనుక మీకై వేచి యుండుట. మీరొక ధనవంతుని కుటుంబమునకుఁ జెందినవారనియు, దయాసాంద్రులనియు, మీపేర ద్యూత రావనియు, యింకను మీయోగ్యతలఁ గూర్చియు నేనిది వఱకే దెలిసికొనుంటిని.

అచ్యు—మీరు క్రొత్తవారుగ నున్నను మీ పరిచయము నాకెక్కుడానందమును గల్పించుచున్నది గాని యీదినము మీన మిరువురమును విశేషకాలము కలసి మాటాడ వలను పడదని జెప్పుట కెంతయుఁ జింతిలుచున్నాఁడను.

సీతా—ఏమిబాబూ, తామట్లనిన నేనేమి చేయఁగలను. ఈ దినమంతయు.........

అచ్యు—ఏలఅర్థోక్తియందేమీమాటనుముగించితిరి? పూర్తిగఁ జెప్పఁగూడదా?

సీతా—చెప్పుటకేమున్నది? ఈ దినమంతయు దిన నన్నము లేక యల్లాడుచున్నాను.

ఈ యుదంతమంతయు విని యచ్యుతరావు కొంచెము సేపాలోచించి చెన్నపట్టణమున నీటకక్కరితనమున జీవించు వారెందరో గలరు. ఈతఁడు గూడ నా తెగకుఁజెందిన సోమరి పోతుగ నుండునా? ఏమియు దెలియవచ్చుటలేదు గదా యని యనుకొనుచు అన్నమని యడిగినపుడిచ్చు మూల్యమునకుఁ గొంచెమైనను విలువయుండునని తలంచి అట్లయిన నిదిగో దీసి కొమ్మనుచు నొక రూపాయి నిచ్చెను. సీతారామచంద్రుఁ డతివినయముగ నామూల్యమందుకొని అచ్యుతరావుగారూ, మన మిరువుర మీ సాగరతీరమునం గూర్చుండి, ప్రస్తుతావసరములం గూర్చి ముచ్చటింప నాకు వేడుకగుచున్నయది. ఈసుసమయమున నాప్రార్థన నంగీకరింప వేఁడుకొనియెదను.

అచ్యు—నేనిందొక పావుగంట మాత్రమె యుండి యావెనుక మైలాపురమునకు నా మిత్రునియొద్ద కేగవలసి యున్నది గాన మీతో ముచ్చటింపఁజాలనందులకు మన్నింపుఁడు-

సీతా—తమరీ నగరమున వాసముసేయు ప్రదేశము దెలిపినచో రేపు సాయంతనము మిమ్ముఁ గలసికొందును.

అచ్యు—జార్జిటౌనునందుండు జహాంగరువీధి 126 కవాట సంఖ్యగల మహారీ రెండవయంతస్తునందని జెప్పుచు సీతా రామచంద్రుని గరస్పర్శనముఁ గావించి సెలవుఁ దీసు కొనెదనండీ, యని జెప్పి యటనుండి కదలి పోయెను.

సీతారామచంద్రుఁడును రేపీతనిపనిఁ బట్టవలయుననియు నాగరక లక్షణమున విద్యార్థిదశయందుఁ దేలియాడు నితని మనస్సు నావంకకుఁ ద్రిప్పుకొనుట సులభంబే యనియు నీపాచికతో నేను గొప్పలాభముఁ బడయుకాలము సమీపిం చినదనియు తనలో నేమేమో గొణుగుకొనుచు "ప్రిన్సు హొటెలు" మార్గమునుబట్టి పోవుచుండెను.

---

## తృతీయతరంగము.

కులశేఖరము నాయుఁడుగారొక సంపన్నగృహస్థులు వారితండ్రి రాజమహేంద్రవరములో బియ్యము మరలుంచి వ్యాపారము జేయుచు లక్షలకొలఁది ధనమును సంపాదించు చుండెను. వారు నాయుఁడువంశమునఁబడు బలిజ సంఘమునకుఁ జెందినవారు. కులశేఖరము నాయుఁడుగారు రాజమహేంద్రి

వరమున స్కూలుఫైనలు తరగతి వఱకుఁ జదివి చెన్నపురి క్రైస్తవ కళాశాలయందు ఇంటర్మీడియెట్ తరగతియందు జేరి ప్రస్తుతము బి-ఎ సీనియరు క్లాసులో జదువుచుండెను. అప్పటి కతనికి దాదాపుగ యిరువదిమూఁడు వత్సరముల ప్రాయముండి మిగుల చక్కదనము గలిగియుండెను. అట దన తండ్రిగారికి బరిచయులగు నొక మిత్రుని యింట దానపానాదుల కేర్పాటుగావించుకొని ఆయింటియందలి మహాడ్పైన నివసించుచుఁ బెద్దలయం దడకువయు, ఒజ్జలయందు భక్తియు గలిగి సర్వజనులు పొగడునట్లు, విద్యార్థులందరు గొనియాడునట్లు నటించుచుఁ దనవిద్యాభ్యసన కార్యనిమగ్నుఁడై యుండెడి వాడు. బాల్యవినోదములయందు దన విలువయగు కాలమును వినియోగింపక విద్యార్జనావిధానముననే గడపుచుండెను. కళాశాలయందు దనకనేక మిత్రులు, తోడివిద్యార్థులెందరో యున్నను వారందరితో నెక్కువ సంబంధము గలిగించుకొని తైతక్కలాడక స్వేచ్ఛగాఁ దనకాలమునుగడుపుచుండునుగాని యెక్కువగ నవనాగరకోద్యమదేవతకు వశుఁడై సీమదొరల చందముగా మారిపోక సదాచారసంపన్నుఁడగు హిందూ కుటుంబమునకుఁ జెందిన వానివలెనే తన వేషభాషాదులచే నగపడుచుండును నిష్కల్మషహృదయుఁడు; సత్యశీలుఁడు; ఈశ్వరోపాసి; ప్రజాహితతత్పరుఁడు. ఈతనికి మిత్రులెవరు బొత్తుగా లేకపోలేదు. తనతోఁగూడఁ గళాశాలలోఁ జదువు

నొక్క సుగుణుని మాత్రమే ప్రాణమిత్రుఁడని తలంచియుండెను.
అతఁడే మనయచ్యుతరావు. అచ్యుతుఁడు కులశేఖరమును దన
ప్రాణమిత్రునిగను, కులశేఖరాచ్యుతులన్యోన్యము ప్రాణ
మిత్రులవలె దినదినప్రవర్ధిత స్నేహవాత్సల్యతా బద్ధులైరి.
వారిరువురికిఁగల మైత్రిని వర్ణింపఁ దరముగాకుండెను. వారిరువు
రేకార్యముఁ జేయఁదలచినను నొకరికొక రెరుకపఱుపక చేసెడి
వారుకారు. వారిరువు రాంధ్రదేశమునకుఁ జెందిన గోదావరీ
కృష్ణామండలవాసులు. సమీపమండలములవలెనే వారి
మైత్రియు నొకరికొకరికిఁ గడుదాపుననేయుండెను. కళాశాలల
యందలి యుపాధ్యాయులు, విద్యార్థులు మాత్రమేగాక మఱి
యితరులును వీరిరువురి మైత్రి సౌజన్యములఁగూర్చి వేవిధముల
బొగడుచుండిరి.

---

## చతుర్థతరంగము.

ఆ నాఁడు చక్రవర్తిగారి జన్మదినము. చెన్ననగరములోని
ప్రాథమికపాఠశాల మొదలున్నతకళాశాల వరకన్నియు
మూయఁబడియుండెను. విద్యార్థులందరును విచ్చలవిడిగ నుల్లము
లలర నాడుకొనుచుండిరి. మఱికొందఱు జట్లుజట్లుగఁ గూడి
కాఫీహోటేళ్ళ కాశ్రితులగుచుండిరి. కొందరు పాఠములు
వల్లించుకొనుచుండిరి. మఱికొందరుజూన స్నెయిటో, చల్లారాంగా

యార్ చంద్, దయారాం, హాస్సారాం, కృష్ణాకంపెనీ మున్నగు వస్త్రవిక్రయశాలలకరిగి తమకు వలయు విలువగల వలువలం గొనుచుండిరి. కొందరు పుస్తకశాలల కేగి కావలసిన గ్రంథములు గొనుచుండిరి. కొందరు ద్యూతమాడుచుండిరి. వేయేల, విద్యార్థులందరు వారివారి మనోభిప్రాయముల ననుసరించి ప్రవర్తించుచుండిరి. మన యచ్యుతరావు మాత్రము సాయంతనము నాలుగు గంటలకు సరిగ జహాంగీరు వీధియందలి 126 కవాట సంఖ్యగల గృహమున రెండవ యంతస్తునందొక విశాలమగు గదియందు మడతకురిచీపై గూర్చుండి వార్తాపత్రికను జదువుచుండెను. ఇట నీతనింగూర్చి మనము పూర్తిగ దెలిసికొను టత్యంతావసరమును, గథావగాహమునకు సహాయకారియు నగునుసుండీ! అచ్యుతరావు నివాసస్థానము కృష్ణామండల మందలి తాడేపల్లిగూడెము. ఈతఁడు నియోగివంశమునకు జెందిన బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రియగు గోపాలరావుగారుత్తర సర్కారులందు "ఎగ్జిక్యూటివు ఇంజనీయరు" పదవియందుండి విశేషముగ భూవసతియుఁ గొన్ని వేల మూలధనమును సేకరించి ప్రస్తుత ముపకారవేతనము గైకొనుచు స్వగ్రామమునఁ గాలము గడపుచున్నాఁడు. అచ్యుతరావునకు జననియుఁ గలదు. అన్నదమ్ములు లేరుగాని యొక సోదరిమాత్రము గలదు. ఆయమ చిన్నవయస్సున నున్నందున నింకను నవివాహితగ నెయున్నది. గోపాలరావునకు మఱి పుత్రసంతానము లేనందునను యచ్యుత

రావుసాహెబ్‌గారు ధనయుక్తుఁ డైనందునను కుమారునియందుఁ దానెంతయో ప్రేమగల్గి యల్లారుముద్దుగఁ బెంచి పెద్దవానిగఁ జేసెను. అంతియగాక తనవలె నాతనినిగూడ నాంగ్లవిద్యాకోవిదునిగ నొనర్చి రాజకీయసంబంధమగు నొక పెద్దయుద్యోగమున బ్రవేశపెట్టవలయునని గట్టికోరిక గలిగియున్నవాఁడు. అందు కనియే మెట్రిక్యులేషన్ వఱకు బెజవాడ హైస్కూలునందు జదివించి చెన్నపురిక్రైస్తవకళాశాలలో "ఇంటర్మీడియెట్" తరగతిలో జదువ బ్రవేశపెట్టెను. మన అచ్యుతరావు బాల్యమునుండియు నెల్లరియెడలను సమానమగు ప్రేమజూపు వాఁడనియు గర్వమనునది ఎఱుఁగక శాంతశమదమాది సద్గుణములు గలిగి వర్తించు వాఁడనియుఁ బేరెన్నికగాంచుచుండెను. కళాశాలయందలి యొజ్జలయెడ వినయవిధేయుఁడై తోడి విద్యార్థులునయితము మెచ్చుకొనులాగునఁ జరించుచు, నేతరగతియందును దప్పిపోక జయమందుచుండెను. పాశ్చాత్య నాగరకవేత్తలమని విఱ్ఱవీగు కొందరు విద్యార్థులవలె నిండ్లకడ నుండి పోషకులు విద్యాభ్యసనావ్యయములకని పంపుపైకమును సినీమాలకో, నాటకప్రదర్శనములకో, పేకాటలకో, తగుల బెట్టునట్టివాఁడు గాక అచ్యుతరావు తనతండ్రిపంపుధనము క్రమవ్యయములకు మాత్రమే వినియోగించుచు మిగిలినపైకమును భద్రముగ దాచియుంచుచు నుండెను. సంవత్సరాంత పరీక్షాసమయ మొక మాసమునకు మిగిలియుండినందున నచ్యుతుఁ

డితర చింత లేమాత్రమును లేక యెక్కుడుపట్టుదలతోఁ జదువుచుండెను. మనకథాకాలమునాఁటి కచ్యుతరావు బి-ఏ సీనియరు తరగతియందు జదువుచుండెను. విద్యాగ్రహణా మందితని కసాధారణమగు ప్రజ్ఞగలదనుటకు జెన్నపురమందలి కళాశాలఁ జేరినదాదిగ దప్పిపోక పరీక్షయందుఁ గృతార్థుఁ డగుచుండుటయె తార్కాణము. అచ్యుతరావు పసితనమున నుండుటం జేసియు, సామర్థ్యాతిశయము గలవాఁడగుటం జేసియు, సంపన్న గృహస్థునికిఁ దనయుడగుటం జేసియు, బి-ఏ పరీక్షయం దీమారు తప్పకఁ గడతేరుదుముగదా యను ధైర్యమాతనికి మెండుగ నావహించి యుండుటం జేసియు తన జీవితమున నన్నియు దనకానందముగనే యగపడుచుండెను. ఆంగ్లభార తియు నాతని కేమియు గష్టమునీయక ఆనందముగనే సాగిపోవు చుండెను నాఁడుమాత్ర మాతఁడు వార్తాపత్రిక నిటునటుఁ ద్రిప్పుచు విడువక జదువుచునేయుండ నామిద్దె మెట్లమీఁద నెవరో నడచునట్లచ్యుతరావున కొకధ్వని వినవచ్చుచుండెను. పత్రికాపఠన పరాఙ్ముఖుఁడై వచ్చువారెవ్వరై యుందురాయని యాతఁడాలోచించుచుండఁగనే యొక పురుషవ్యక్తి వచ్చి రెండు చేతులు నెత్తి యచ్యుతరావునకు నమస్కరించి యెదుట నిలువఁబడెను. అచ్యుతరావాతనిఁ గాంచినతోడనే "ఓహో! సీతారామచంద్రుఁడుగారా! అనుకొనిన రీతి వచ్చితిరే. చాల సంతోషము. ఈకురిచీపైఁ గూరుచుండు" మని పలుకరించెను.

వల్లెయని యాతనికెదురుగ నుండిన కురిచీపై సీతారామ చంద్రుఁడు గూర్చుండెను.

అ.—ఏమండీ, మీవిషయ మేమిటి? త్వరగా నెఱింగింపుఁడు. నేనీ సాయంత్రమున నొకపనిమీఁదఁ బోవలసియున్నది.

సీ—ఆతురపడెద రేల? మీ రీదినమంతయు విశ్రామమునఁ గడుప వచ్చునుగదా?

అ—విశ్రామదినము లప్పుడప్పుడు దొరకుచుండునని యూరక కాలముఁ గడపుచుండిన నావిద్యావిధానము పూర్తి యగు టెట్లు? పరీక్షాదినములు సమీపించుచుండుటచే నా సోదరవిద్యార్థులఁ గలసికొని పాఠములు కొన్ని విమర్శించుకొనవలసియున్నది.

సీ—నేను మీ విద్యావిధానమును భంగపరుప వచ్చితినని తామును దలఁచితిరా? కాదు. మీబోఁటి సత్పురుషుల నెయ్యము సంపాదించినఁ గృతార్థుఁడ నగుదుననియే మిమ్మింతగ బ్రతిమాలుచుంటిని.

అ—అందు కేమి? కానిండు. మీ యభిమత మెద్దియో యెఱిఁగింపుఁడు.

సీ—నాతో మాట్లాడుటకే వ్యవధి చాలదనుచుంటిరే! మీరీ దినము రావలసినదిగ నిన్నఁ జెప్పినందున నేనింత చొరవగ మీయొద్దకరుదెంచితిని. నా యభిమత మేమని యెఱిఁగింప గలను?

అ—సీతారామచంద్రుఁడుగారూ ! నేను మీయందవిశ్వాస నీయము బ్రవర్తించుచున్నానని తలపకుడు. మీయట్టి మిత్రులు నాయట్టివానికి లభించుట మహాభాగ్యము గదా!

వీరిరువురిట్లు సంభాషించుచుండగనే సుమారిరువది రెండు వత్సరముల యీఁడుగల యువకుఁడొకఁ డత్యాతుర ముగ మేడమెట్ల నధిరోహించుచు నచ్యుతరావును సమీపించి "యేమండోయి ! అచ్యుతరావుగారు ! మన మనుకొన్న విషయము మఱచి వ్యర్థప్రసంగములతో కాలముగడపు చుంటిరేల ? మనమిాతత్క్షణమే నియమిత ప్రదేశమునకు వెళ్ళ వలసి యున్నదిగదా ? మన పరీక్షాకాలము సమీపించుచున్న దను సంగతి మీ రెఱుఁగరా ? యనెను. ఈ మాటలువినిన తోడనే అచ్యుతరావదరిపడి లేచి "మిత్రమా ! ఈ నూతన మిత్రుని సందర్శనముచేఁ గొంచమాలస్యమైన" దనుచు దన గదియందలి కుడ్యమున మేకునకు దగిలించి యుండిన 'షర్టు'ను దొడిగికొని రాజమహేంద్రవరము పట్టుపంచెను వల్లెవాటుగ వైచికొని పోదములెండని ప్రయాణమున సాసన్నమాయెను. ఆయవసరముననే ప్రక్కనుండిన సీతారామచంద్రునిఁ గాంచి తమరీదినమున గొంచమోర్వవలయును. రేపటిదినము సాయం తనము నాలుగుగంటలకు మీఁదుగ నన్నీప్రదేశముననే కలిసి కొనఁ గోరెదనని యచ్యుతరా వత్యాదరమునఁ బలికెను. సీతారామచంద్రుఁ డామాటలు వినియు విననివానివలె

నటించుచు మోమునిండ బొటనవ్రేలు గ్రింద రాచుచు యుట్టె యనంగీకార సూచకముగ నిలువఁబడియుండెను. అచ్యుత రావాతని చేష్టలన్నియు గమనించి తన జేబుయందలి డబ్బు సంచి (మనీపర్సు) ని దీసి దానముగ నైన నుండనిమ్మని యొక వరహా నాతని చేతియందుంచి, రేపు సాయంతనము తప్పక నన్నుం గలిసికొనుఁడని రెండవమారు నయితముఁ జెప్పుచు నాగతమిత్రుని భుజముపైఁ జేయి వైచికొని మేడనుండి దిగెను. సీతారామచంద్రుఁడు గూడ వారి ననుసరించియే దిగి వచ్చుచుండెను. వారికని కాచియుండిన దగుటచే గుమ్మమునొద్ద నుండిన రిక్షానెక్కి యచ్యుతరావును నాతని మిత్రుఁడును గలసి క్రైస్తవకళాశాల విద్యార్థులవసతి గృహము ననుసరించి పోయిరి.

---

## పంచమతరంగము.

సీతారామచంద్రున కానాఁడచ్యుతుఁ డిచ్చినది చిన్న మొత్తమేయైనను అది దొరకుటానాఁడతనికిఁ గడు సంతోష ముగనే యుండెను గాని, యీయొకవరహాతోఁ దృప్తిఁబొందిన నేమిలాభము? ఇటువంటి వరహాలెన్ని వమ్ము గావింప వలయునో గదా? ఔరా! ఎందరో విద్యార్థులఁ గాంచి యుంటినిగాని యచ్యుతరావుం బోలు విదార్థిని నేనెన్నఁడును

జూచియుండలేదు. ఎన్నివిధముల నాతని వశపఱచుకొని మెచ్చ టింపఁ దలఁచినను తన విద్యాసంపాదనాభిలాష నే మాత్రమును వదలక వాయిదా లిడుచున్నాఁడు గదా ! అయిననేమి? రేపీతని పని బట్టకమానుదునా ? యని దురుద్దేశపూరితుఁడై తనలో నింకనేమో గొణిగికొనుచు జహాంగీరు వీధిని వీడి సీతారామ చంద్ర చండాలుఁడు దన గృహమునకు మెల్లఁగాఁ జేరుకొనియెను.

ఆ యిల్లంత పెద్దది గాకున్నను సామాన్యపు మిద్దెటిల్లు. దానియందొకటి రెండు కాపురములుగూడఁ గలవు. సీతారామ చంద్రునకు భార్యాబిడ్డలుగాని మఱి యితరులుగాని లేనందున వీధి ప్రక్క నొకగదిని మాత్రము మూఁడురూపాయల యద్దెకుఁ గుదుర్చుకొని వాసము చేయుచుండెను. ఆప్రక్కనే యుండు వన్నవిక్రయశాల (మిాల్సు హోటలు) యందు మాసమునకు పదునైదు రూపాయలిచ్చి భోజనము సేయుచుండెను. ఆనాఁడు సీతారామచంద్రుఁడు రాత్రివేళకు సరిగ భోజనముఁ గావించు కొని వచ్చి తనగదియందలి మడతమంచముపైఁ బరుండి త్యాగయ్యగారికృతులను సన్నని కంఠముతో రాగమును గలిపి కొని పాడుచుండెను. చెన్నపురమందలి వారవనితావిలాసము లన్నియుఁ జూరగొని వారికొక్కొక్కమారు పాదములపయిత మెుత్తుచుమధ్యవర్తిగనుండి ఎన్నొకుటుంబములనాశ మొనర్చి పరధనాపహారణముఁ గావించుచు వేశ్యాగానమాధుర్యమును దలఁచుకొఁ గ్రోలుచుండు వాఁడ సీతారామచంద్రుని పాటలు వినువారల కింపుగనుండునను టతిశయోక్తి కానేరదు. అప్పటికి

రాత్రి ఎనిమిదింబావుగంటకు సమీపించుచుండెను. గాఢతమమగు తమస్సుచే వీధులందలి విద్యుద్దీపముల కాంతి ప్రకాసిల్లు నానమయమున నొక స్త్రీ వ్యక్తి యాగది యొద్ద కరుదెంచి తన కదివరకే పరిచయమగుటచేఁ గాబోలు జంకు గొంకులేక గదిలోనికిం జొచ్చి యిదిగోనండి జాబని సీతారామచంద్రున కొక శ్రీముఖమందించెను. ఓహోహో సుబ్బా! నీయజమానురాలి యుత్తరమాయిది? లేఖ నింతయవసరముగ నేల పంపవలెను? రేపుదయమున వచ్చి నే మాట్లాడవలయునని యుంటినిగదా! సుబ్బ "నాకాసంగతి తెలియదు. ఈదినము సాయంతనమే నామె గ్రామాంతరమున కరుగుచు మీకీజాబి" మ్మని చెప్పిపోయినది.

సీతారామచంద్రుఁ డట్లు సంభాషించుచు లకోటాను బగులఁగొట్టి యందుండిన వార్తాసంగ్రహపత్రమును బైకిఁదీసి చూచెను. దానియందిట్లుండెను.

మహారాజరాజశ్రీ

ప్రియమగు సీతారామచంద్రరావుగారికి.

శిరస్సాష్టాంగవందనములు.

మీరు నాయొద్దకువచ్చి వెళ్ళినదిమొదలు నాదేహము పులకరించుచున్నది. నాకు ధనచాపల్యముతోఁ బాటు కామోద్రేకమునను, జిహ్వాచాపల్యమును బుట్టిపోవునేమో తోఁచకున్నయది.

ఆగర్భ శ్రీమంతుఁడగునచ్యుతరావుంగూర్చి నేనుదమకుఁ జాలదినములుగఁ జెప్పుచుంటినిగదా! ఆతని స్నేహమును వాంఛించి నామనసెంతయో వాడిపోవుచున్నది. మీరేమో నావిషయమున నెక్కుడు పరిశ్రమజేయుచున్నట్లును, అనుకూల పరిస్థితు లేర్పడుచున్నటులును రెండు మూఁడు రోజులలో నచ్యుతరావు నేనాడిమన్నట్లాడఁ జేయునట్లును జెప్పియుంటిరి. ఇంతదనుక నట్టి యాచూకియేమియుఁ గానరాకున్నయది.

తలవని తలంపుగ నాకీసాయంతనమే కాకినాడయందొక వైశ్యునియింటఁ జరుగువివాహమునఁ "భోటకచేరి"కి రమ్మని తంతివార్త (టెలిగ్రాం) వచ్చినది. అచ్యుతరావుగారి స్నేహ సంపాదనా విషయమున నాకీ యాహ్వానముపై మనసు పోవకున్నను నధమము మూఁడువందలకుఁ దక్కువగాని మొత్తమిందు లభింపనుంటచే నింమల కియ్యకొని యీ రాత్రి కలకత్తా మెయిలునకు నామేళముసహా బయలుదేరి వెళ్ళు చున్నాను. రెండుదినములు మాత్రమే యందుండి మూఁడవ నాఁడీ యూరుఁ జేరుదును. ఈలోపునఁ దామీ విషయమున నుపేక్షవహింపక శృంగార రస సంబంధ ప్రసంగములచేతను, నా రూపరేఖావయోవిలాస వర్ణనా చమత్కృతిచేతను, నాతని మెప్పించి వలపునకు దింపి నాకొఱకాతురపడునట్లు జేయుఁడు. మీకిందులకై ఏర్పాటుజేసియుంచు మొత్తమూ వెంటనే తప్పక యిచ్చివేయుదును.

అంత దనుక మీాస్వాంత వ్యయములకని యిందులోఁ బంపిన పద్మునైను రూపాయలను బ్రీతిపూర్వకముగ నందుకొనుఁడు. కఠినహృదయులును, వేదాంతవేద్యులునగు వారెందఱినో గూడ త్రైతక్కలాడించు నసాధారణ ప్రతిభాశాలురగు మీారా యచ్యుతరావుగారిని లోఁబరచికొనుట శ్రమకరము కాదనియే నానమ్మకము.

ఇటుల,
మిమ్మనవరతము నమ్మియుండు
ప్రియమగు— మోహన.

లేఖ నామూలాగ్రముగ రెండు మూఁడు పర్యాయములు ద్రిప్పిచదువుచు, నామోహనా రచిత భాషాసౌష్టవమునకును, చాతుర్యతకును పలుమారెదలో మెచ్చుకొని తనకై సుబ్బు తెచ్చియుండిన రూప్యములందికొని దానింబంపివైచి యచ్చుతరావు నాచెప్పినట్లొప్పికొనుటకు భగవానుఁ డనుగ్రహించుఁగాక యని యనుకొనుచు నాయుత్తరమును, పైకమును దనపరుపుపైనిఁ దలగడక్రింద నుంచుకొని యట్టె సీతారామచంద్రుఁడు గుఱ్ఱువెట్టుచు నిదురవోయెను.

## షష్ఠతరంగము.

అరుణోదయ మగుపరికే సీతారామచంద్రుఁడు నిద్రమేల్కాంచెను. నిత్యకృత్యములన్నియుఁ దీర్చికొని కాఫీహోట

లకుఁ జెల్లవలసిన కానుకలు చెల్లించి తానివసించు వీథియం దలి కొందఱు యువకులను జేర్చుకొని చీట్లాడుటకుఁ బ్రారంభించెను. ఆతని కింక వేరుపని యేమున్నది? వారవనితారూప రాక్షసులకు సుకుమారులగు పురుషుల బలియిచ్చుట, తన్మూలమున సంపాదించిన ధనమును గొల్లగ నే బ్రాందిషాపులకో, మఱియే పేకాటలకో వినియోగించుట, అనవరతము దుర్వ్యాపారనిమగ్నుడై యుండుట- ఇవి యేయితనిదినచర్యలు. చీట్లాడుటతో మాత్రమే నాదినమంతయు గడుపలేదు. బ్రాంది విక్రయస్థానమున కేగి వలయునంతఁ దనపొట్టఁబోసికొనెను. కై పెక్కుచుండుకొలఁది యాంధ్రభాషా పరిచిత వేశ్యారత్నములు మోహానం బోలువారెందరతోడనో నీతనికి బరిచయముండుటచే వారి దెలుఁగు పాటలు జ్ఞప్తియందుంచుకొని "మఱవురాదే చెలీ" యని కూనరాగముతో దారిపొడుగున వచ్చుజోవువారేవగించుకొందురేమో యనియైన దిగులునొందక అటునిటు దూలుచు తన యిల్లుఁజేరి నానందమున నోలలాడుచుండెను. వేళకు మాధ్యాహ్నభోజనముఁ గూడ గుడిచెను గాని మనస్సంతయు నాయచ్యుతరావు వంకకే పరుగెత్తుచుండెను. నాలుగుగంట లెపుడు గొట్టునాయని యత్యాతురమున గడియారమును గ్రూరంపుఁజూపులఁ జూచెను. ఆతని వేదన దీర్చుటకో యన గడియారము టంగ్-టంగ్ మని నాలుగు దెబ్బలు గొట్టెను.

సీతారామచంద్రుఁడంతఁ దటాలున లేచి గదితలుపునకు మిల్లరు తాళపుముద్దను దగిలించి వల్లెవాటును సవరించుకొని "జహాంగీరు" వీధి మార్గమును బట్టిపోయి అప్పుడే కళాశాల నుండివచ్చి విశ్రాంతి ననుభవించుచుఁ గూర్చుండియున్న యచ్యుతరావుం గలిసికొని చేయెత్తి నమస్కరించెను.

అచ్యు—రండు కూర్చుండుఁడు.

సీతారామచంద్రుఁ డాతని కెదురుగనుండిన కురిచీపై నాసీనుఁడై "సంవత్సరాంత్యపరీక్షలు సమీపించుచుండుటచే మీకేమాత్రము విరామము లేనట్లగపడుచున్నదే! మొత్తము నకా భగవానుని యనుగ్రహమునఁ బరీక్షలయం దుత్తీర్ణులగుదురుగాక?" యని యాశీర్వచనపురస్సరంబుగ బలికెను.

అ— ఔనండీ; ఈసంవత్సరమన్ని వత్సరములకంటె మాపఠనీయగ్రంథస్థ పాఠభాగము లెక్కుడు కఠినముగనున్నవి. విద్యార్జనమునకై యెంతయో డబ్బు వ్యయపఱచుచు దూరదేశములనుండి వచ్చి కష్టపడి చదువకుండిన నేమి లాభము? జయాపజయములు భగవదధీనములు. కాని మన పరిశ్రమము మనము చేయవలసియున్నదిగదా?

సీతారామచంద్రుఁ డేమేమియో లోకాభిరామములు మాటలాడఁదొడంగెను. ఎందరనో బుద్ధిశాలుర నయిటెము వంచించి దుర్బుద్ధి నలవడఁజేసి వెలవెలందుల పాదములొత్తఁ

జేసినవాని కచ్యుతరావుఁబోలు నార్ద్రమనస్కులగు యువకుల
చేలు వుచ్చుటంత కష్టకార్యమా?

వీరిరువురకు మైత్రి యపరిమితముగఁ బెఱిగిపోయెను.
వారు మాట్లాడుకొను విషయములం దపుడపుడుఁ గలుగు
చుండు రసపరిభావముచేఁ గడుపుచెక్కలగునట్లు నవ్వుకొను
చుండిరి. సీతారామచంద్రుఁడా మోహనంగూర్చి యచ్యుత
రావున కింతవఱకుఁ జెప్పలేదుగాని శృంగార విషయక దేశ
చారిత్రములు-నిప్పటి నవనాగరకోద్యమము మఱేవేవో పలు
విషయములం గూర్చి సంభాషించుచుండెను. అచ్యుతరా
వొక్కొకమారు సీతారామచంద్రుని వక్తృత్వాతిశయమున
కచ్చెఱువందుచుఁ బరాకులేక వినుచుండెను. వారిరువు రిట్లు
గొంతకాలము ముచ్చటించుకొని బీచ్చి విహారమునకుఁ బోవ
నిశ్చయించుకొని, మేడమీఁదనుండియే యచ్యుతరావా వీథినిఁ
బోవుచున్న రిక్షావానిని సముద్రపుటొడ్డున కొచ్చెదవా? యని
యడిగెను. వాఁడిదే వస్తానండీ! రండీ! యని వీథిగుమ్మము
నొద్దకు బండినిదెచ్చెను. పాపము! అచ్యుతరావుం గపటమన
నెట్టిదియో దెలియని యమాయకుఁడు. ఎల్లఱుఁ దనవలెనుండు
వారనియే భావించువాఁడు. అందుచేతనే తానిదివర కెన్నఁడుఁ
గానని సీతారామచంద్రుని కపట వినయములకు లోఁబడియెను.

వారిరువురు రిక్షానెక్కి ప్రథమదివసమునఁ బరిచయము
గలుగఁజేసిన రాజధాని కళాశాల నావరణము నాఘకొని

పోవు "మెరీనారోడ్డు" మార్గముగ సముద్రతీరముం జేరిరి. కార్యమనుకూలించు మార్గమగుపడుచున్నదిలే యనియు, నీక నచ్యుతరావు నేఁజెప్పినట్లెల్ల నాడఁగలఁడనియు, సీతారామచంద్రుఁడు లోలోన సంతసించుచు, నందలి ప్రకృతి విశేషములం గూర్చి యిరువురు సంతసమున ముచ్చటించుకొనుచు నాయిసుకపఱ్ఱల యందిటునటు పచారు సేయుచుండిరి. సీతారామచంద్రుని బుద్ధియంతయు అచ్యుతరావును గైవసముగావించుకొనువిషయముననే లీనమైయుండెను. ఆ సాయంతనమంతయు సముద్రతీరముననేగడపి, రాత్రి యేడుగంటలగుసరికే యచ్యుతరావునొద్ద సెలవుఁ గైకొని సీతారామచంద్రుఁడు తనయింటి దారినిఁ బట్టిపోయెను. అచ్యుతరావు స్నేహపాత్రుఁడగుటచే నాతని మైత్రివలనఁ గలుగబోవు దురంతముల నారయక సీతారామచంద్రునకు హస్తస్పర్శనముగావించి అందుండి బయలుదేరి తాను మాసవేతనమిచ్చి భుజించుచుండిన 'కోమలవిలాస్' యను హోటలునకుఁ బోయెను.

---

## సప్తమతరంగము.

చంద్రుఁడుదయించెను. నాఁడు పౌర్ణమి యగుటచే కళానిధి సంపూర్ణ కళావిలసితుఁడై యుండెను. భూమియంతయు బిండికొట్టారబోసినట్లు పండువెన్నెల గాయుచుండెను. నగరమం

దలి కాముకీజనమున కేగాక యాబాల గోపాలమునకా వెన్నెల మిగుల హాయినిఁ గూర్చుచుండెను. అట్టి సమయమున మనయచ్యుతరాయసీతారామచంద్రులు జహాంగీరువీధియందలి మేడపయి వసారాయందు పడకమంచముపైఁ గూర్చుండి తాంబూలము వేసికొనుచు నాఁటి వెన్నెలం గూర్చి వేడుక మీర మాటలాడుకొనుచుండిరి. శీతారామచంద్రుని దృష్టి యంతయు వళ్యభావమునసే లీనమై యుండెను. సుధాకరుఁడానందముఁ గూర్చుచుండినను, సీతారామచంద్రుని పలుకు లమృతోపమానములుగఁదోఁచుచుండినను, నచ్యుతరావు మాత్ర మపుడపుడు విద్యావిధానముం గూర్చి జింతించుచు నీసాయంత నమునుండియు నూఱికేఁ గాలముగడపుచున్నానే యని తల పోయుచుండెను.

సీతా—బ్రదర్! ఏ మీనాఁటి మహిమ! ఈవెన్నెలం గాంచితిరే? పగలంతయుఁ గాయకష్టములం బడినవారికి వెన్నెల చల్లదనము మిగులహాయినిచ్చి శ్రమయనునది యావంతయుఁ గనఁబడనీయదు గదా!

అచ్యు—అందులకు సందేహమేమున్నది ?

సీతా—యుక్తవయస్కులగు దంపతులకీ చుక్కలగమికాఁడు చొక్కమందై వలపునకు దారిఁజూపి శయ్యాగారముల యందు సొక్కుచు—సోలుచు దేలియాడఁజేయుచుండును. విరహిణీవిరహులకీ వెన్నెల మిగుల దుస్సహాకారి.

అచ్యు—దుర్గమమగు నమావాస్య చీఁకటివలెఁ గాక ప్రపంచమున కంతయుఁ దేజోదాయకమై యజ్ఞానమగు చీఁకటిం బారఁద్రోలి విజ్ఞానముంబోలు వెలుఁగునిచ్చి ప్రజాళికిసుఖం బొడఁగూర్చు చంద్రకాంతిని గేవలము కాముక కాముకీ వర్ణనలతోఁ బరితృప్తిఁ బొందఁజూచుట నాకెంతయుఁ గష్టతరముగఁ దోఁచుచున్నయది. మఱియు తమవంటివారు బుద్ధివికాసవంతములగు నే యార్యుల చారిత్రములనో మఱి యితర సద్వృత్తాంతములనో చెప్పక, నేఁటి సాయంతనము నుండియు మీరనవసరముగ స్త్రీవిషయక ప్రసంగముఁ గావించుట నామనం బొల్లకున్నయది.

దుస్సంకల్ప విరహితములగు యీపలుకుల విని సీతారామచంద్రుఁ డట్టె నిర్విణ్ణుఁడై పోయెను. దైవమా! చిన్ని చూపుఁ జూడకుమా! యని లోలోన గుంది ప్రయత్నపరుం డగుటచే ధైర్యమూని

సీ—యచ్యుతరావుగారూ! మీరింత యసూయపడెదరేల? మీవయస్సు ననుసరించి మాట్లాడితిని. ఎంత విద్యార్థిదశ యందున్నను గేవలము మాటలచేతనే మీ విద్యాసము పార్జనమునకు భంగమెునవునా? బుద్ధిచాతుర్య మనునది యున్న నెన్నిమాటలాడినను, మఱేకార్యమొనర్చినను విద్యాభంగ మెన్నఁటికిని గలుగదు.

అచ్యుతరా పీవమాటన్నియు వినసహింపరానివిగ నిరసించి సీతారామచంద్రుఁ డేమనుకొనునో యని మిన్నకుండెను

సీతారామచంద్రుఁడు మాత్రము మారుకొనలేదు. స్త్రీ విషయిక ప్రసంగమెక్కుడు రసవంతముగ వర్ణనాతీతముగఁ గావించుచుండెను. స్త్రీలే ప్రపంచమున కాధారభూతులనియు, వారి సహజలావణ్యమే పురుషుల కానంద దాయకమనియు విశేషించి వారకామినుల సంబంధము యుక్తవయస్సునందు పూరుషుల కమితానంద మొడఁగూర్చుననియుఁ బిచ్చివానివలె సీతారామచంద్రుఁడు వదరుచునే యుండెను. ములుకులం బోలు నీమాటలు విన్నమాత్రముననే యచ్యుతరావులిక్కిపడియెను. అప్పటికే కొంచెకొంచెముగ ధన్నావరించుచుండిన నిద్రాదేవియుఁ బరుగెత్తిపోయెను. ఇదియా ప్రార్థనాపూర్వకమగు స్నేహఫలితము ? యని నిట్టూరు విడిచెను.

సీతా—అచ్యుతరావుగారూ ! ఈ పండువెన్నెలయందు గానకళావిశారదయగు నొకవేశ్యారత్నము "మోహనరాగము" లయతోఁజేర్చి పాడిన మీ యుల్లమెట్లుండునో చెప్పఁగలరా

అచ్యు—మహాశయా ! సీతారామచంద్రబాబూ ! నను నిద్రయావరించుచున్నది. చాలరాత్రియైనది. ఇఁకఁ బరుండుము.

సీతా—సోదరా ? స్త్రీల కంఠనాదమును వీనులకింపుగ విని యానందించి యుంటిరా! ఆగర్భశ్రీమంతునికిఁ దనయుఁడవగుటచే నిదివర కట్టి గానకళామాధుర్యమును గ్రోల

కున్నను ముందైనను మీరు చవిచూతురనియే నా
నమ్మకము.

అచ్యు—నేనిదివరకీ విషయము లెట్టివో యెఱుంగను. నావిద్యా
క్రమమంతయుఁ బూర్తియైన తదుపరి నా వివాహసమయ
మున సంగీతపరిచయముఁ గలిగింతురు గానింకు. ఇపుడీ
ప్రసంగమును బూర్తిగ నాపివేయుఁడు.

సీతా—ఆహా! భగవానుని యనుగ్రహంబున నట్టి యద
ననతి కాలమున లభించిన "గానకళావిశారద" యను
బిరుదంది, శృంగారఖనియును, సురూపవతియునై విలసిల్లు
నా "మోహన" యొక్క గానమాధురీ మహిమచే మీ
యొడలు పులకరించునట్లు జేయకమానుదు ననుకొంటిరా!

బిరుదములం దగిలించి గుణవర్ణనఁ గావించుచు సూచిం
చిన "మోహన" యను నా స్త్రీనిఁ గూర్చి వివరముగఁ దెలిసి
కొన నూహించి యచ్యుతరావు సీతారామచంద్రునితో
నిట్లనియెను. "గానకళావిశారద" యగు మోహన యేవంశీకు
రాలు? ఆబిడ వాసస్థానమెద్ది! సీతారామచంద్రున కది సుస
మయముగఁ దోఁచెను. అంతకు మిగిలిన వ్యవధి యుఁకదొరక
దని యాతనితోఁ దనయుద్దేశ్యమంతయు నెఱిఁగింపఁ దీర్మా
నించుకొనియెను.

సీ—ఔరా! ఏమనవచ్చునండీ! మోహనాసందర్శనముగలిగిన
నాతఁ డమరలోక మందలి రంభంగాంచినట్టే గాదా!

అయ్యో! మఱచితిని. గానకళావిశారద యను బిరుదు మాత్రమే గాక అభినవరంభ యను బిరుదముగూడ మొన్న నే గాద యామె సంపాదించినది.

అచ్యు—ఏమండీ? మీ యవ్యక్త ప్రలాపములు? నేనొకటి యడిగిన మీరొకటి యనవసరముగ జవాబిచ్చు చున్నారు. నిద్రాదేవి మిమ్మావరించినది గాబోలు. పరుండి నిదురపొండు. నాకను మేలొనగూర్చిన వారగుదురు.

సీతా—చిత్తము! క్షమింపుడు. ఏదేనొక విషయము జెప్పఁ బూనినపుడు విశదముగఁ జెప్పవలయునుగాని పాత్రౌచిత్య మెఱుఁగక విడగొట్టినట్లు మాటలాడిన స్వారస్యముగ నుండదని తలచి తమకా మోహానను గూర్చి యామూ లాగ్రముగ నెఱిగింప సాహసించితిని.

అచ్యు—అటులైన నామెవిషయ మేదియో సూక్ష్మముగ నెరిగింపుడు.

సీతా—రసికుడా! మోహన నివాసస్థానము ప్రస్తుత మీ చెన్నపురమే యైనను, నెల్లూరు మండలాంతర్గతమగు కావలిపత్తనంబుననుండి యాంధ్రభాషయం దెక్కుడు పాండిత్య మాచిన్నివయస్సునందే సంపాదించి నెల్లూరున కేరన్నికఁ గాంచిన యొక నటకునిచే నభినయమును, నప త్యాగయ్యయో యను కావలిపత్తనవాసి—సంగీతసాహిత్య

బిరుదాంకితుఁడగు అప్పన్నగారి సోమయ్య శాస్త్రిలు రొద్ద సంగీతము నభ్యసించి రజస్వలాత్పూర్వమే తన తల్లితోడ నీ నగరముఁ జేరినది.

అ—మీరింతగఁ జెప్పిన యామె కులముంగూర్చి చెప్పకున్నను, విద్యాక్రమమును బట్టియు, మీ హాగ్రత్తను బట్టియు నా "మోహన" పరధనాపహారిణులును, భారతసంఘ నిర్మూలనాచణులునగు వేశ్యాసంఘమునకుఁ జెందినయువతి యని తలఁచితిని. ఈ నాయభిప్రాయము పొరబాటు కాదుగదా?

సీతా—అవును. గౌరవనీయమగు వేశ్యాకుటుంబముననే మోహన యుదయించినది. ఇంతదనుక యామె పడుపు వృత్తియందు దిగక మిమ్ముఁబోలు ధనికుల యిండ్లయందును, జమీందారుల యిండ్లయందును, వివాహాది శుభకార్యము లలోను, గొప్పగొప్ప సమావేశములలోను బాటకచ్చేరీలు జేయుచు నూరాలు లార్జించుచున్నది. ఆహా, యేమని చెప్పవచ్చు నామెయాహానాకార రేఖా విలాసములు! మన్మధా కారులగు మిముబోలు—మరుగేల—మీరే యావారకాంత మణిని బ్రిక్కనికుకొన్న రెయుండారులు బ్రసంగించుకొనిన నాదికాలమున శ్రీకృష్ణుఁ డమరలోకమునుండి పారిజాత కుసుమముం దెచ్చియిచ్చినపు డా సత్యభామా భామణము లెట్లుండి ప్రేమ నతిశయింపఁజేసెనో యట్లుండుననుటకు

నందియుండునా? ఏమి? ఆ యొయ్యారము! ఎల్లపుడామె శ్వేతాంబరములే తాల్చుచుండెను. నాబిడ తొడగు కంచుకము ప్రేక్షకుల నాకర్షించుచుండును. ఇక సొమ్ములం గూర్చి చెప్పవలయునా? నవనాగరక కాలమున వన్నెగఁ గానిపింపఁగల మేలిసొమ్ములన్నియు నామె ధరించు చుండును. అచ్యుతబాబూ ! ఆమె వయస్సింకను షోడశ వత్సరముల నైన దాఁటలేదు. ముఖపద్మ మతిసుందరము గను దేహము బంగరుశలాకవలెను యుండును. ఇంతదనుక పురుష సందర్శనమే కలుగకున్నందున నామె శరీర మావం తయేని పసివాళ్లువాడక రతీదేవినిఁ గూడఁ దలఁదన్నునట్లగ పడుచుండును. ఆజవ్వని సౌందర్యముంగూర్చి వర్ణింప నా యాదిశేషునకైన నలవియగునే ? చూచితీరవలెగాని చెప్పినతీరదు. ఆ మోహన తన మృదుమధుర కంఠము నుండి వెలువడు "పున్నాగవరాళి " యను రాగముచే నెటువంటి కఠినచిత్తులనైనను మోహపరవశులుగఁ జేసి బాష్పసహితము సిరుగ కలుగఁగఁజేయునదిగదా ! లావణ్య సీమయగు నాపడంతి పొందు తమకు గలిగి యీనాఁటి పండువెన్నెలయం దానందాబ్ధి నోలలాడినగదా నీపండు వెన్నెలయు సార్థకమగును. అదియునుగాక మీావయస్సుకు సార్థకమును, మీా మనస్సుకు సంతసమును నగును. కేవలమీా వెన్నెలంజూచి యానందమందుచు నీ మడత మంచముపైఁ బరుండి పొర్లాడిన నేమిలాభము ?......

సీతారామచంద్రుని మోహనోపదేశ ప్రపంచ మచ్యుత రావు మనస్సును దహింపజేయుచుండెను. "సెహబాస్ !" మంచి యుపదేశ మొనర్చితిరి. మోహన యందమును, పాండిత్యమును వర్ణించుటతోఁ బోక మఱి దానికి, నాకు సంబంధముఁగూడఁ గలుపనెంచితిరా ? ఇందుకనియా తామింత బలవంతముగ నా మైత్రిని గుదుర్చుకొనుట? విద్యార్థినను సంగతియుఁ, బరీక్షా ఫలితములకై నేఁ బడు శ్రమయు మీరీ రెండు మూఁడు దివసములుగఁ దిలకించి యుండియు వేశ్యాప్రసంగతాదోషసాగరమున నన్ను ముంచి నాశ మొనర్పఁజూచుట తమకు న్యాయముగఁ దోఁచుచున్నదా? వినమా ఆర్యచారిత్రములు ! బ్రహ్మర్షిత్వముం బడయను తపమాచరించుచుండిన గాదిసుతుండగు విశ్వామిత్రుఁడా దేవవేశ్యా నటనాభిచాతుర్యములకుఁ దన యమూల్యమగు తపోధనమును ధారవోసికొనెనుగదా ! ప్రాపంచిక సుఖమెట్టిదియో యెఱుఁగని యాశుకయోగీంద్రుఁడుగూడ స్త్రీల లాలనలకు లోఁబడి పరీక్షిన్మహారాజ సన్నిధానమున కర్భకుని వగిది బేలయై వచ్చియుండెనుగదా! ఏకాదశీవ్రతఫల మీభారతావనియందుఁ బ్రచురింపఁజేసి వైకుంఠనగరమునకు విపులద్వారమును దెఱచియుంచిన రుక్మాంగదమహారాజు మాయదారియగు నామోహినికి వశ్యుఁడై వ్రతభంగ మొనర్చుకొనుటకు బాల్పడెగదా! పరస్త్రీసంగమము- అందును వేశ్యాసంపర్కము మహాపాతక

మని వేదము లుద్ఘోషించుచున్నవి గదా! పరస్త్రీగమనముచే రావణుడు- కీచకుడు- నాదిగాగల వీరవరేణ్యులు పడిన బన్నము లెఱింగియున్నాముగదా! అహల్యాగమనముచే నసురారియగు నా దేవేంద్రునికై నగతియు వినియుంటిమిగదా? సీతారామచంద్రా! నీ దుశ్చరిత మింకొకమాటు నా యెదుట స్మరింపకుము. నాయొడలట్టే యుడికిబోవుచున్నదని యచ్యుతరావు బిగ్గఱగఁ జెప్పెను.

తామంతగ కోపపడియెదరేల? ప్రస్తావవశమున నొకటి వెంబడి యొకటి మాటలాడవలసివచ్చినద్ది. ప్రజ్ఞావంతులగు తమకీ మాటలతోడనే విద్యాభంగ మెుదవునా? తమకంత శ్రమగనుండిన నిఁక మాటలాడను. నిద్రింపుఁడని చెప్పి...... ఈతని నేవిధముగ లోఁబఱచుకొనఁగలను? మనస్సెమాత్రమును జలింపకున్నది. అయినఁ గానిమ్ము. రేపీమాత్రము పరిశ్రమముఁ జేసి చూతమని తనలో ననుకొని సీతారామచంద్రుఁడు నిశ్చింతతో గుఱ్ఱువెట్టుచు నిద్రవోయెను. అప్పటికి దాదాఁపుగ రెండు గంటలు గావచ్చుచుండుటచే వృథగనింత యాలస్యమైనదిగదా యని చింతించుచు నచ్యుతరావుగూడ వెంటనే నిద్రాదేవికి వశుఁడై పోయెను.

---

## అష్టమతరంగము.

గతరాత్రి వారిరువురుఁ జాలకాలము మేలుకొనియుండుటచే మఱుదిన మరుణోదయమై బాలభానుని కిరణప్రసాద

ములు వారిరువురి శరీరములు సోకినంతదనుక నిదుర మేల్కొనం జాలకుండిరి.

సూర్యరశ్మి స్పర్శముచే ముందుగ నచ్యుతరావు మేల్కాంచెను. తెల్లవారినదని తెలియక నిశ్చింతతోఁ బీనుగు వలె బడియుండిన సీతారామచంద్రు నచ్యుతరావు దట్టిలేపెను. మోహనవిషయకావేదనము మాత్రము సీతారామచంద్రుని వదలకుంటుటచే నేనిమిషమున కానిమిష మచ్యుతరావును దన వలలోఁ బడ వైచికొనుటకుఁ బొంచియేయుండెను. పడకనుండి లేచి యిరువురుఁ గాలోచితకృత్యములఁ దీర్చుకొని కాఫిహోట లునకేగిరి గాని సీతారామచంద్రుఁడు విశేషించి మాంసాహార ముల దినువాఁడగుటచే నచ్యుతరావుతోడి ఫలాహారమాత్రనికి సరిపడకుండినను, విధిలేక తనకార్య సాఫల్యమునకై నాఫలహార ములనే యెట్లో కుడుచుచుండెను.

కాఫిహోటలునుండి వారిరువురు మరలివచ్చు సమయ మున దారియందొక జవ్వనివిద్యార్థిని రిక్షానెక్కి వెళ్ళుచుండ నా మెంజూపి సీతారాముఁడు "యచ్యుతరావుగారూ ! అల్లదే వెళ్లుచుండు పడుచువలె నుండునండీ యామోహన స్వరూపము. నేనెందరనో నాకీమనుష్యుఁ గాంచితిఁ గాని వేశ్యారత్నమగు నామోహన సౌందర్యము, నా యామె పాండిత్యము, నాయామె సంగీతమ్మాధురీ మహిమ మేమనుష్యుదానియందును గాంచియుండ లేదండీ !" యనెను.

అచ్యుతరావు మాటలకేమియు మారువలుకక వినియూ విననివాని పగిదిఁ దనయిల్లుఁ జేరెను. సీతారామచంద్రుఁ డచ్యుతరావు విద్యాపరిశ్రమమున కెన్నియో విధములనాటంక ములు గల్పించెను. తనపాఠములా- జరుగుటయేలేదు. కళా శాలకు వెళ్లు నిచ్చయా గల్గుమార్గమే లేదు. అనవరతము తన్నడు గంటఁజేయు మాటలే తనకు వినవచ్చుచుండెను. ఔరా! సీతా రామచంద్రుఁడు తన పొట్టకూటికైగదా, అమాయకులగు నచ్చుతరావుంబోలు యువకుల బేలువుచ్చి వేశ్యలయిండ్లు ధనధాన్య సంపదల కాలవాలము గావించి రియాగర్భశ్రీమంతుల నయితము భిక్షాధికారులుగ నొనర్చుచుండుట! తన కార్యనిర్వ హణమునకై ప్రథమమున స్నేహితునివలె వచ్చి రానురాను ఘోరరాక్షసునివలెఁ బరిణమించెను గదా! పవిత్రవంతమగు నీభారతావనియందు బుట్టి యిట్టినీచకృత్యముల కావంతయేని వెఱపుగొనక చరించు దురాశాపూరితులగు నీదుండగీంద్రు నేవిధమున శిక్షింపనగును? ఖండతుండములుగ ఛేదించినను బాపము రాదుగదా! విమలకీర్తియుతమగు నో భారతజననీ! అయ్యో! నీకుక్షియందు వేశ్యారూప పిశాచములగూడ నవత రింపఁ జేయువలయునా? పుట్టినబో వారందరు సాంసారిక వృత్తి నవలంబించి "వ్యభిచార"మనురక్కసినుక్కడంచి వేశ్యావృత్తి నేదలనెత్తనీయకుండజేసిన మీమెంతయో సౌఖ్యంబును, నీవెంతయో గౌరవంబును బొందియుందుము గదా!

పరస్త్రీ సంగమాభివృద్ధివలన దేశమెంతయో నైచ్య దశ ననుభవించుటయెగా కొండొరులకు మనస్పర్థలు, తన్మూలమున నెన్నియో హత్యలు, దారాపుత్రాదుల విడనాడుటలు, కుటుంబకలహములు, విద్యాభంగములు, అగర్భశ్రీమంతులగు వారు ఫకీరులగుటలు, రోగవిజృంభణములు, గౌరవదూరులగుటలు మరెన్నియో యనర్థములు వాటిల్లుచున్నవిగదా! అట్టివి నీకన్నులార నెన్నియో గాంచియు నీపుత్రీపుత్రుల కావంతయైనను హితము గఱపఁగూడదా ?

సీతారామచంద్రుని ప్రార్థనపై నా దిన మచ్యుతరావు కళాశాలకు బోవుటయే మానుకొనెను. మానుకొనినను నాడింటియొద్ద దన గ్రంథములైనను జదువ నుద్యమించెమన నేమాత్రము సాగకుండెను. ఎందుచేత ? నూతనమిత్రుని యనర్థదాయక వాక్పటిమా మహిమచేతనే. సీతారామ చంద్రున కాంధ్రభాషయందుఁ బరిచయముండుటచే నందుండిన చిత్రనళీయనాటకమును దీసి బాహుకుఁడు పాతివ్రత్యశీలయగు దమయంతీ ద్వితీయ స్వయంవరాహ్వానపత్రమును జే నిడుకొని ప్రలాపించు నంకమును రసవంతముగఁ జదువఁదొడంగెను. అందలి "నాదనామక్రియా నవ్యవైఖరిభామ నన్నుఁ బాయ వటంచు నమ్మియుంటి" యను సీసపద్యమున కొక్కొక్క పాదమున కొక్కొక్క రాగమందు సూచించినరీతిఁ దీయుచుఁ దల యూచియూచి చదువుచుండ నిఁక నచ్యుతరా వాంగ్లపాఠ

ములుజదువుటెట్లు? తన చేతియందలి గ్రంథమును దనయెదుట నుండిన మేజాపై నుంచెను. ఆతని కేమియుఁ దోఁపకుండెను. తనమనస్సు పరిపరి విధముల జింతాసముద్రమున మునింగిపోవు చుండెను. ఆసమయముననే జనరల్ పోస్టాఫీసు నుండి యొక తపాలాజవాను మేడపైకివచ్చి యొక యుత్తరము నచ్యుతరావును గుర్తించి యిచ్చెను. లేఖనందిచ్చుటయేకాక తనపేరున నైదువందల రూప్యములు మణియార్డర్ ద్వారా వచ్చియున్న వనియు నామొత్తమును పోస్టాఫీసునకువచ్చి తీసికొమ్మనియుఁ జెప్పుచు వాఁడు వెళ్ళిపోయెను. అచ్యుతరావా యుత్తరమును జించి చూచెను. అందిట్లుండెను.

చిరంజీవి కుమారునకు నాశీర్వచనములు:—

నీయుత్తరములన్నియు నందినవిగాని నేనూర లేనందున వెంటనే బదులీయకుంటిని. నీకు పరీక్షాసమయము సమీపించుచున్నదిగదా! వృథా కాలమును వినియోగింపక అప్రమత్తుఁడవై చదువుచుండుము. ఈసారి పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడవై మనకులగౌరవము నిలుపుము. నామనస్సంతయు నీవిద్యావిధానమందే లీనమైయున్నది. జాగ్రత్తగాఁ జదువుము. నీవు కోరినట్టు గా కదనముగమూఁడువందలు, అంత మొత్తమైదు వందల రూప్యము లీదినమే నీపేరను మణియార్డరుమూలముగ బంపియున్నాను. ఆమొత్తమున రెండువందలు మాత్రమే నీకళాశాల వేతనమునకును, భోజనము, బస, మున్నగు వసతు

లకును, దుస్తులకును నింకను రెండు మాసముల వరకు వ్యయము నకుంచుకొని, నిందుతోడ, జతపఱచియుండు జాపితా ప్రకార మాయా రకముల వలువలు మిగత మూఁడు వందల రూప్యములకుఁగొని, మూఁడు దినములకు లోపుగ నాపేరను రైలు పార్సిలుద్వారాఁ బంపకోరెదను. నీసోదరియగు లక్ష్మీ బాయమ్మ నత్తగారింటికి బంపనుద్దేశించి సమీపమున నొక శుభదివసము నిర్ణయించియున్నందున నింతత్వరగఁ బంపుమని వ్రాసితిని. కార్యావసరములచే నిఁకఁ గొన్నాళ్ళవఱకు నే మదరాసునకు రాఁజాలను. ఇక్కడందరు కులాసగ నున్నారు. గ్రహింపవలయును.

పానకాల గోపాలరావు,

తాడేపల్లిగూడెం.

లేఖయందలి తండ్రిగారి విద్యావిషయ కాజ్ఞాపనముఁ జూచి యచ్యుతరావు చాల భయపడియెను. నిన్నటి సాయంత నము నుండియుఁ గాలమంతయు వ్యర్థ॥పుచ్చుచుంటి నే! ఇట్లైన నా విద్యావిధాన మెట్లు పూర్తియగుననుచు మిన్నకుండెను. నూతనమిత్రుఁడు గూడ భపాలుజవాను వచ్చివెళ్ళినది మొదలు జరిగిన విషయమంతయుఁ గనిపెట్టుచునే యుండెను. లేఖా వృత్తాంతము నైదువందల రూప్యము లచ్యుతరావుచేతికి వచ్చు విషయమును గన్గొనెను. గోపాలరావుగారి లేఖ సీతారామ

చంద్రునికిఁ గొంచమేవగింపుఁ గలిగించినను రూపాయల విషయము మాత్ర మాతని కత్యంతామోదమును గలుగజేయ "ఈయచ్యుతరా వీ రూకలర్పించి యీ మోహన పాదము లొత్తునట్లు జేయకుండిన నే సీతారాముఁడనా?" యని యాత్మ ప్రతిజ్ఞఁ గావించుకొని యచ్యుతరావు నుద్దేశించి "యేమండీ! తండ్రిగారి యుత్తరమును జూచినదే మౌనము వహించి తిరి? పోస్టాఫీసునకు వెళ్ళి పైకము దెచ్చుకొనఁగూడదా?"

అపుడే యచ్యుతరావు పోస్టాఫీసునకు బయలుదేరెను. పిలువకయే సీతారామచంద్రుఁడు నాతని వెంట నంటెను. పోస్టాఫీసునకేగి యందలి యుద్యోగిం గాంచి తనకై వచ్చి యుండిన వైదువందల రూప్యములందుకొని యిరువురు నిలు జేరిరి. అచ్యుతరావా పైకమును తన గదియందున్న బీరువ యందు బదిలపరచి తాళము వేసికొనెను.

సీ—అచ్యుతరావుగారూ ! నేనొకటి రెండు విషయములు తమకుఁ జెప్పదలచితిని. అసూయపడక వినునట్లొప్పికొని ననే తమకవి చెప్పగలను.

అ—అసూయ యేమున్నది ? చెప్పఁగూడని విషయములు జెప్పిన నసూయ గలుగుగాని, అందున మీరు మిత్రులగుటచేఁ జెప్పినమాట లెట్టిన వినవలసినవే గదా !

సీ— రాతిరి మీతో ప్రస్తావించిన "మోహన" నొక్కమారు తాము జూడ వీలగునా ?

అ—నేనెక్కడ ? వారవనిత యగు నా మోహన యెక్కడ ? దానిం జూడవలసిన ప్రమేయము నాకేమున్నది ?

సీ—సుకుమారులగు మీరామచంద్రనిభాననుజూచి దాని మృదుమధురపికనాద మొకగంట గాకున్న నొక నిమేషమైనను విన్నచో, జన్మము పావనమైనదని తలంపకుందురా?

అ—అంతటి రసికురాలైనచో రసికాగ్రేసరుఁడఁగు నేమహాశయునకో యామె దర్శనము గలుగవలయునుగాని విద్యార్థినగు నాకాయమ సందర్శన మెందులకు ?

సీ—మిమ్ము నిర్బంధించుచున్నాఁడనని తలంపవలదు. నేను దాని రూపరేఖావిలాసములఁ గాంచి మిముఁగాంచినతోడనే మీకును, నాస్త్రీరత్నమునకును బరిచయము గలిగించిన యుక్తముగ నుండునని భావించితిని.

అ—దాని పరిచయము నాకెందుకండీ ?

మ. "కనమా యెందరొ భోగభామినులసాంగత్యంబు కాంక్షించిని
ర్ధనవంతుల్ బహురోగవంతులురుచింతాక్రాంతులై నిత్యయా
తనలన్ భొందుచు జీవితంబువియిరోఁతం జెందుచుం గుందుటల్
మనమా! వద్దిక బుద్ధిగల్గి ధనభామాసంగముం మానుమా.

ఆ. మానగౌరవములు మర్యాదలును లేవు,
శీలధనము లేదు స్వేచ్ఛలేదు
క్షణికమైన సౌఖ్య సంతోషములు లేవు
రోఁతకాదె వేశ్య జాతి బ్రదుకు.

ఉ. రాగముగల్గు పల్లవులు రాగముదంబును దెచ్చుకొంచుఁదా
రాగము గల్గుదానివలె రాగముఁబాడుచు మోవివీటికా
రాగముదోఁప మచ్చిక సరాగములాడుచు మెచ్చుకొంచు
రాగముఁ దెచ్చియిచ్చిన నరాధిపుఁడైనను బేదవడ్డచో
మూగతనంబుబూని మొగమోటములేక నెనరింత లేక బల్
త్యాగతనంబునేర్చినగరాసును దల్లిని నప్పగించి తా
బీగములేసి నెవ్వగలఁబెట్టి సరాగుఁజేయునా,
భోగముదానితోఁ జెలిమిపోలదు! పోలదుసుమ్మి! మిత్రమా!"

(చమత్కార చంద్రిక.)

యని కవికుంజరులు వచించిన నీతివాక్యము లెన్నియో కలవు. ఇవన్నియుఁ దాము చదివియుండిన బాగుండెడిది. ఆర్య చారిత్రములు మన కాదర్శప్రాయములు గావా?

సీతా — కవిత్వమున కేమి గానిండు. "చేడెల యధరామృతంబు చెందని నోరుఁ బాడుంగవాని నోరును బూడిద కిర వైన పాడుబొందర" యని సుమతి శతక కరయు

చ. వలచిన లేమగూడుటయె భాగ్యము భార్యలవల్లఁదత్సుఖం
బలవడ దన్యకాంతలనఁగా మఱి తల్లులవంటివారు వే
శ్యలకిది సున్న యొక్కటెయె సంభవమందిన నట్టివేశ్యతో
గలయుటకన్న వేఱొకటికల్గునెస్వర్గము మోక్షమున్ భువిన్"

యని యింకొక కవీశ్వరుఁడును జెప్పియుండలేదా? యెట్టినబోలు మహాకవి కళాశాస్త్ర మెందుకు రచించెను? కాల్పనా, మఱి చదువనా? తమకెందుకండీ నామీఁదనూయ? ఆ మోహన మీకెట్లు లభ్యపడును? నేఁబోయి వచ్చెదనండీ. వీలున్న స్నేహమును మఱువక నెప్పుడైన మిమ్ముఁ జూడఁగలనని జెప్పుచు మేడమెట్లనుండి దిగుచుండెను. అచ్యుతరావాతని సమీపించి ఏలనింతగ గోపపడితిరి. మీమైత్రి నాకానందమునే కల్పించినది. నాతోనే యుండుఁడు. ఇంకెక్కడికిఁ బోవుటయని చేయిఁబట్టి లాగెను. సీతారామచంద్రుఁడు బలవంతముగఁ జేతిని వదలించుకొనుచు రేపు మిము గలసికొనెదనండీ యని చెప్పి యటనుండి వెడలిపోయెను.

## నవమ తరంగము.

సీతారామచంద్రుని ప్రయాణముతో మన యచ్యుత రావునకు చాలినంత విరామము దొరకినను నాతని చిత్తము మాత్రము స్థిరముగ నుండలేదు. మనస్సొకపరి తనకళాశాల వంకకు, నొకతూరి తన జనకుని లేఖపైకి, నొకమాటు నవ్యమోహినియగు మోహనవంకకును బరుగువారుచుండెను. పలుపోకలు బోవుచుండు తన మనస్సు నెంత మఱలించి నను మఱలకుండెను. సీతారామచంద్రుని వారకాంతావర్ణనా మహిమ పెనుభూతమై యచ్యుతరావును జుట్టుకొనెను. అతని హృదయము విషపూరితము గావించెను. మనస్సు చిరస్థాయిని నిలువలేకపోయెను. తన పఠనపుస్తకములన్నియు ముందునిడు కొనెను. ఒక్కొక్కటిగఁ జదువ నారంభించెను. తనయప్పటి చదువు తనకమిత దుస్సహముగఁ దోఁచుచుండినను దనమనస్సు నమితసామర్థ్యముగఁ దుల్యమార్గమున నడిపించెను. తనవెనుకటి తలంపులన్నియు మఱచిపోయెను. నాఁటి సాయంతనమే తన జన కుఁడు గోరివ్రాసిన వలువలంగొన బజారునకు వెళ్ళనుద్దేశించెను గాని తననేస్తకాఁడగు కులశేఖరమునాయుఁడానాఁడు బజారు నకు రాఁవీలులేనందున నాపనిని మానుకొనెను. విశేషప్రతిభా వంతుఁడగుటచేతను విద్యా వినయ వివేక సంపన్నుఁడగుట చేతను జలించిన మనంబును మఱలించుకొని భగవానుఁడా! ఆ సీతారామ సందర్శన మింకనాకుఁ గలిగింపకుందువుగాక ! యని ప్రార్థించుచు నాఁడంతయుఁ దనకాలము గ్రంథపఠనము తోడనే గడపుచుండెను.

సీతారామచంద్రుఁ డానాఁడంతయుఁ గడపి మఱుదిన ముదయము పండ్రెండుగంటలకుసరిగ నచ్యుతరావుం జూతమని యాతని బసయొద్దకు వచ్చిచూచెను. మేడద్వారము మూసి యుండెను. ఆఁతడు కళాశాలకు వెళ్ళియుండుననితలఁచి సాయం తనమాతనిఁ గలసికొ నుద్దేశించి మరల తనయిలు సేరెను. ఆ సమయమునకు సరిగ గాఁచియుండి సుబ్బాక యుత్తరమాతని కందిచ్చెను. ఆయుత్తరమున—

ప్రియమగు సీతారామచంద్రరావుగారూ!

నే నీ దినముననే కలకత్తామెయిలునఁ గాకినాడనుండి సురక్షితముగ వచ్చిచేరితిని. సుందరరూప విగ్రహుండును లక్ష్మీకటాక్షాంశ సంభూతుఁడునగు నచ్యుతరావుగారిని వశము నర్చుకొంటిరా? అట్లయియుండిన నేఁటిసాయంతన మాయనను నామందిరముఁజేర్చి మీ నియమిత ధనముఁ గొనిపొండు. కార్యము ఫలప్రదముగాకయుండిన తామొక్కతూరి యిక్క డకు దయచేసి నన్నుఁ గలసికొని పొండు.

మిమ్మనవరతము నమ్మియుండు
ప్రియురాలు,
మోహన.

యని యుండెను. దానిం జదువుకొని

మోహనా! నీ యుత్తరమందినది. బుద్ధిమంతుఁడును నీతిశాలియు, విద్యావంతుండును, నిష్పక్షపాతియు నగు నచ్యుతరావుగారిని నీకై పలుభంగుల బేలించుచున్నాను. బేలిపోగలఁడు. ఈదినము సాయంతనమైనను రేపుదయమైనను నీకతనినర్పణము గావించఁగలను.

ఇట్లు
నిరంతరము నీకై శ్రమపడు ప్రియుఁడు,
సీతారామచంద్రరావు.

అని తానొక యుత్తరముఁవ్రాసి సుబ్బుచేతికిచ్చి పంపివేసెను. ఆఁతడాకార్యమును ముగించి వెంటనే బయలుదేరి అప్పుడే కళాశాలనుండి వచ్చి వార్తాపత్రిక చదువుచుండిన అచ్యుతరావును గలసికొని ఏమండీ వార్తాపత్రికావిశేషములు? అని హెచ్చరించెను.

అచ్యుతరావదరిపడి దయచేయండి యనుచుండగనే కొంచెమైనను సిగ్గుగొనక యందుండిన కురిచీపైఁ గూరుచుండెను రామచంద్రుఁడు.

అ—నిన్న నాయందు దామంతగ నలిగితిరే? నిన్న నే కాలేజికి వెళ్ళని కారణము నీదినము చాల చిక్కులు పడితినండీ!

సీ—అవునండీ! విద్యావిధానముగదా! యెన్నియో మార్పులుండును ... ఆ మోహన ... యీదినము వచ్చినదండీ!

అచ్యుతరా వీయనవసర ప్రసంగమును విని చాలమండి పడియెను. "మిమ్మెవరీ ప్రశ్న నడిగిరి? ఆ విషయమై యిక నాయొద్ద నోరెత్తకుఁడని మరియొకమారు మిమ్ము వేఁడుకొనియెదను."

సీతా—మోహన కాకినాడకు వెళ్ళియుండి యీ దినముదయమున గలకత్తా మెయిలులో నీయూరుఁ జేరియున్నది.

అ—కాకినాడ కెందుకు బోయినదండీ? అందా మెకుఁ దగిన మోహనుఁడున్నాఁడు గాఁబోలు!

సీతా—ఆబిడ కింతవరకుఁ బరపురుష సంగమమే లేదండీ. అందొక వైశ్యునింటఁ జరిగిన వివాహమునకుఁ బాటకచ్చేరికై వెళ్లియుండి కొన్నివంద లార్జించుకొని వచ్చియున్నది.

అ—అయినఁ గానిమ్ము. దానితో బ్రసక్తి మన కెందుకు?

సీ—ఆ చెలువ సౌందర్యమీనాఁడు జూచితినండీ. మిమ్మా సమయమునఁ దలఁచుకొని చాల చింతించితిని.

అ—నన్నుం గూర్చి తమ కెందులకపుడు చింత గల్గినది?

సీ—ఆ సుకుమారిస్నేహమ్ము మీకుఁ గలిగి మీరిరువు రెపుడానందమున మెలంగుదురా యని.

అ—మిత్రమా! మీకింకన్ను బిచ్చివదలలేదా? వేశ్యాసంపర్కమతినీచకృత్యముగదా!

"తే. ఒకనితోఁగూడి భాషింతు రొక్కనరుని
జూతురు విలాస సంపద సొంపుగులుక
మఱియు నొక్కని దలతురు మనసులోన
గూర్చు ప్రియుఁడెవ్వఁడో ముద్దుగుమ్మలకును.

ఉ. చేరి మనోజధీవరుని చేత భవాంబుధిలోన నంగనా
కారముఁ బూనియున్న పెనుగాలముచిమ్మగినయ్యె దానిచే
భీరుజనాదరామిషముఁ బేర్మి భుజించు నరాండజంబులన్
వారక సారెకుందిగిచి వండుమరుం డనురాగవహ్నిలోన్.

క. స్తనపర్వత దుర్గమమై
ఘనమగు కాంతాశరీర కాంతారమునం
జనఁబోకు మనఃపాంధుఁడ
కనలుచు మరుఁడనెడి దొంగ గలఁ డచ్చోటన్.

క. జారభట చోర చేటక,
చారవట ప్రభృతి నీచజన నిష్ఠీవా
ధార శరావము వార
స్త్రీరమ్యాధరము సంస్పృశింతురె కులజుల్.

చ. కలికి మెఱుఁగు వాలుఁదెలిగన్నులు సన్నపుఁగౌనుదీగపై
నలరెడు సద్వళీలతలు నంచిత యౌవనదర్పలక్ష్మిచేఁ
గులికెడునిబ్బపువ్వులుద గుబ్బలునుంగల మించుబోండ్ల రూ
పులఁగని నిర్వికారులగు పూరుషులే కృతకృత్యులిద్ధరన్."

యనిమహామహుండగు లక్ష్మణకవియు మఱియొక సంస్కృత కవీశ్వరుండు:—

"శ్లో॥ దర్శనాత్ చిత్తవైకల్యం స్పర్శనాత్తు ధనక్షయం
సంభోగాత్కిల్బిషం పణ్యస్త్రీణాం ప్రత్యక్షరాక్షసాం."

పణ్యస్త్రీలను బ్రత్యక్షరాక్షసులనుగాఁ జెప్పి వారిని జూచుట చేతనే చిత్తచాంచల్యమును, దాఁకుటచేతనే ధనక్షయమును, సంభోగముచేతనే పాపమును వచ్చునని చెప్పియున్నారు. భర్తృహరి సుభాషితము లోకమాఱు స్మరించుకొనుడు. విద్యార్థినగు నాకెందులకీ వగపుగలిగింపఁ జూచెదరు. సంసారకల్పవృక్షమునకు వేరుపురుగులును, బాతివ్రాత్యామృత రసమునకు విఱుగుడు మందులును నయిన వేశ్యలపాలఁ బడుటచేతఁ గలుగవలసిన యుత్తమ లాభము లేవియుఁ గలుగకపోవుట యటుండఁగా మీఁదుమిక్కిలి మితిమీఱిన యనర్థములుఁ గూడ సంప్రాప్తములు గాకపోవు. మన నీతులును, నిష్ఠలును, నియమములును స్త్రీలచూపులు మన మీఁద బ్రసరింపకున్నంతవఱకే నిలుచునుగాని స్త్రీలగాలి సోకిన తరువాత నవి యన్నియు ఝంఝామారుతమునకు దూదిపింజ లెగిరిపోవునట్లు నానాముఖముల చెదరిపోవక యొక్క నిమిషమైన నిలువఁ జాలవు. ఒక్క మనమాట యెందుకు? యింద్రియనిగ్రహము చేసితిమని పరిత్యవహించి సంసారము త్యజించి యనేకవత్సరములుం దాకలములు తినుచు తపముచేయు ఋషుల

యంతటివారు నయితము మోహముపుట్టించు స్త్రీముఖబింబ మునఁజూచి మోసపోయి తమతపస్సును, గిపస్సును మఱచి యాస్త్రీలనే జపించుకొనుచు వారికి దాసులగుచు వచ్చినారని మనము వినియుండలేదా ? వనవాసులైన జ్ఞానులయవస్థయే యిటులుండ యౌవనమదాంధులయి సంసారసుఖములలో మునిఁగి తేలుచుండు మన మెట్టి యవస్థలకు పాలుపడవల యునోగదా ? అందున వేశ్య లందఱివంటి సామాన్యస్త్రీలు గారు. ఉగ్గుబాలనుండియుఁ బరవంచనమొనరించు నుపాయముల నేర్చుకొని పరులసంసారములనుఁ గూలద్రోసి విత్తార్జనముచేసి యీభూలోకములోఁ దామమాత్రమె బాగుపడవలయునని దీక్షవహించి స్వప్నావస్థయందైనను పాపభీతిలేక దిరుగు మహానుభావురాండ్రు. ఆపయిని విత్తాపహారణముచేయు దొంగ లకు దోడుపడు రాత్రినే దామును దోడుచేసికొని సాధారణ ముగా దీపముల వెలుతురున నూతన వేషములతో తళుకు బెళుకు లని మెఱసి బంగారవు సంకెళ్ళవలె నితరుల నాకర్షించి తమవలలో బడవేసికొని బంధించుటయం దారితేరినవారు. అదిగాక నృత్తవిద్య నధీనము చేసికొని తమకన్నులుదిప్పు మిష మీఁదఁ జూపరుల డెందములు ద్రిప్పుచు తమ యాటలతో సభలోని పెద్దలనుగూడ నాడింపశక్తిగలవారు. వీనికి మెఱుగు దెచ్చునట్లు మన్మథునైనను మరులుకొల్పి యింట బంటును జేయించి పరమ సామర్థ్యముగల యభినయమును జేతఁజిక్కించు

కొన్నవారు. వీరి యన్నిశక్తులను దిగఁద్రొక్కి తానుమించి ప్రకాశింపగలఁ ప్రభావముగల్గి యెటువంటి కఠినహృదయుల నైనను లక్ష్యలాగునఁ గఱఁగించి రాగప్రవాహములో ముంచి తనప్రక్కకాకర్షింపగల సంగీతము వారిజిహ్వాగ్రమున నటించు చుండును. ఇటువంటి యమోఘ సాధనములు గలిగి యెక్కడ జూచినను సుందరవేషములతో మేకవన్నెపులులై యేమరి యుండువారిని మ్రింగ నోరుఁదెఱచికొని వేశ్యారూపముననున్న యపమృత్యుదేవతా సంఘమునకుఁ జెందిన మోహన సందర్శనము నాకెందుకు?

నాకంతటి కాలమరుదెంచి నాభార్య విషయమున నేనెంతయో సుఖమనుభవింపవచ్చును గాని యన్యకాంతా విషయకపరిసంగముచే ననుఁ గాల్చివేయకుఁడు. పరమపూజ్యమగు భర్తృహరి సుభాషితములేగాక వేనవేలు గ్రంథరాజము లీ విషయమున నీతిని బోధించుచుండ నే విద్యార్థి నయ్యు నీదుండగమునకు దిగిన నావిద్య నాశనముగాదా? నాతోడి విద్యార్థులేగాక ప్రపంచమంతయు నన్ను జూచి నగరా? నేఁ బాపభూయిష్టుఁడనై చెడిపోవనా? నాతల్లిదండ్రుల ననవరతముఁ జింతాసముద్రమున ముంచుటయేగాక నింటికి నిల్లాలు దొంతికిఁగడవయుగాని చందంబున నేనల్లాడవలయును గాదా? వేశ్యలమూలమున నెంతమంది లక్షాధికారులు సహితము

భిక్షాధికారులయి తిండికిలేక దేహముచెడి మానహీనమైన బ్రదుకు బ్రదుకుచున్నవారు కారు? వేశ్యాపరాయణులగు పురుషులకు మొట్టమొదట యశోహానియు, ధనహానియు, మానహానియు గలుగును. భోగస్త్రీలమూలమున నెందరు బిడ్డలును, భార్యలును, కుటుంబములును చెడి తిండికిలేక కూటిపేదలగుచుండలేదు! ఎందఱిభార్యలు నాథుల దుర్మార్గ సంచారముల గాంచి సహింపలేక మానముకంటె ప్రాణమధికము గాదనియెంచి యాత్మహత్యలు జేసికొనలేదు! ఎందఱిభార్యలు మానమునకుగట్టువడి యాత్మహత్యా పాపమ్మునకోని గృహమున నొదిగియుండి చచ్చినవారికంటెను భాగ్యహీనులయి యావజ్జీవము మనోవ్యధచేఁ గుంది కృశించుచున్నారు! వేశ్యలకు నీతి నియమములెక్కడివి?

చ. "విదువక పుట్టుగ్రుడ్డునకు వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిన్
జదునకు జాతిహీనునకుఁ జారు నిజాంగము లొక్కరూకకై
కదువడి నిచ్చువారి గుణకల్పలతల్ విదళించు కత్తులం
బదువుఁబడంతులం దనదుభావము జేర్చునెయెవ్వరేనియున్."

యని సుభాషితము వచించిన పలుకులు విశ్వసనీయము గాదా? నావిద్యావిధానమంతయు బూర్తిగావించుకొని నేనొక చక్కని పడంతిని వివాహమ్మాడి సుఖంబుండుతఱి జూచి యీరానందింపవచ్చునుగాని కేవలము కులటయగు మోహనా

పరిచయముఁ గలిగించి నే నాశమగుటం జూచి మీరానం దింపఁ జూచుట మహాపరాధముగదా? మీ ములుకులం బోలు పలుకు లిఁకఁ జాలింపుడు.

సీతారామచంద్రునకీ సుభాషితము లన్నియుఁ గఠిన తరముగఁ దోఁచుచుండెను గాని తనపట్టుదల మాత్రము వదల లేదు. "సర్వజన సమ్మోహనార్హమైన మోహన సర్వజన సమ్మోహనకరమైన యీ సంగీతవిద్యను హస్తాద్యభినయము లతో తాలుకలగునట్లుగాఁ బాడినపక్షమున నేనిదివఱకు చెప్పిన సుగుణములు మాత్రమేగాక, యింకను ననేకము లయిన లాభములును గలిగి మీ కానందము గలుగుననుటకు లేశమైనను సందేహము లేదు. గ్రంథకర్తల నీతులకేమి? కానిండు. వేనకువేలు వ్రాయవచ్చును గాని యాచరించు వారొక్కరైన నగుపడరు. మీ సుభాషితములన్నియు మీకా దర్శప్రాయములుగ నుంచుకొందురు గాని, నా ప్రార్థనమును సంభావించి యొక్క మాఱా మొహాన యింటికడకు దయ చేయుఁ"డని యచ్యుతరావు పాదములు బట్టుకొనెను. అచ్యుత రావదరిపడి • అయ్యో! తాము పెద్దవారుగనుక నీరీతిఁజరించుట న్యాయమా? నే నటకువచ్చి చేయుగల పనులేమున్నవి?

సీ—మిమ్మొక మాఱామె కలసి మాట్లాడవలయునని చాలఁగ బెంగపోవుచున్నది. మీ రింత కఠినచిత్తులని నామెకు దెలిసిన మీ వియోగతాపముచే నాత్మహత్యఁ జేసికొనక మానదు. అపుడే స్త్రీహత్యాదోషము మీ కాపాదించఁ

గలదు. ఇంకెందులకు దాపరికము? మీరూపరేఖా విలాస సౌందర్య మిదివఱకే యామె గమనించి యుండుటచే మీదర్శనమునకామె యనవరత మత్యాతురతతో నాశించుచున్నది. మనమీసాయంతనమే బయలుదేరవలయును.

అ—ఆమె యిల్లెక్కడనున్నది?

సీ—తిరువత్తియూరు హైరోడ్డునందలి యొక మేడయందు.

అ—నారికేళతరువిలసితమై, మందపవనప్రసారితమగు సముద్ర తీరమున నామె యోగ్యతకుఁదగిన బస గుదిర్చికొన్నది గాఁబోలు?

సీతారామచంద్రుఁ డాతని యంగీకారము గైకొనకయే వీధికిఁబోయి వడిగ బరువెత్తగల యొక తురంగద్వయ శకటమును గుదిర్చికొనివచ్చి యచ్యుతరావును దొందరపరచెను. అచ్యుతరావునకీ యుదంతమంతయు మిగుల నయిష్టముగ నుండెను. తనలోఁ దానమితముగ నేమియో యోచించుకొనెను. మోహనను జూచివచ్చినంత మాత్రమున ముప్పేమున్నది? పోయి చూచివత్తము గాక! యని తీర్మానించుకొని విలువఁ గలవలువలం దొడిగికొని శకటమధిరోహించి తిరువత్తియూరు హైరోడ్డున నివసించు మోహన సందర్శనోత్సాహులై నాయిరువురుఁ బోవుచుండిరి.

## దశమతరంగము.

సీతారామచంద్రుని యుత్తరము మోహన కమితానందముఁ గలిగించెను. నాఁటిసాయంతనము తాను గోరికొనిన

పురుషవరేణ్యుఁ డేగుదెంచునని తన మేడనంతయు శుభ్రముగ దుడిచి నలంకరింపఁ దనతల్లిని, చెలికత్తియను నియోగించెను. ఆగృహము నవనాగరకవస్తు సముచయములతో నలంకరింప బడి లక్ష్మీనివాస మనఁదగియుండెను. మేడమీఁది హాలంతయు చక్కని చిత్రపటములతోఁ గుడ్యములన్నియు నలంకరింపబడి యుండెను. పటముల యందలి గోపికా వస్త్రాపహరణము, శకుంతలా దుష్యంతుల సంయోగము, కాళింగమర్దనము, కృష్ణ రాయభారము, మళయాళదేశపు మగువలు మొదలుగాఁగల ఛాయాపటములు ప్రేక్షకుల కానందమును గల్పించుచుండెను. మేడమీఁది హాలునందొక ప్రక్క శయ్యాగార ముండెను. మోహాన తన శరీరమునఁ జలకరించికొనియుండు ఓటో మోహిని పరిమళము మాత్రమేగాక, నాయిల్లంతయు మైసూరూదువత్తుల సువాసనలిచ్చుచుండెను. పట్టుకురిచీలు, పట్టుమంచములు, స్ప్రింగుమంచములు, అద్దపుబీరువాలు మున్నగు పలు విధములగు పరికరము లాయా నియమిత ప్రదేశములయం దుంచఁబడియుండెను. విద్యుత్పవనచాలనీ యంత్రములు వీథి గుమ్మము నొద్దను మేడమీఁది వరాండాయందును సౌరభము నిచ్చు పలువిధములగు పూలమొక్కలు పెంచఁబడియుండు టచే నందలి పుష్పముల సువాసన హాయిగనుండెను. మోహా

నయు విలువగల వలువలం దొడగి మేలిసొమ్ములుదాల్చి తన కున్న మేలిమిరంగుగాక మఱి నూతనముగ రంగునిచ్చునను నూవా చేఁ గాబోలు బూడిదబోలు "ఫేస్‌పౌడరు" ముఖమున కలంది రిబ్బను జడకొనను వ్రేలాడుచుండ సీతారామాచ్యుత రావుగార్ల యాగమనమున కత్యాతురమున మేడమీఁదినుండి చూచుచుండెను.

ఇంతలో రెండు గుఱ్ఱములబండి హుటాహుటి నరు దెంచి మోహానామందిర పరిసరమున నిలిచెను. శకటములో నుండి యిరువురు పురుషవ్యక్తులు దిగి యొకరివెనుక నొకరు శంక లేక మేడమీఁదకు వెళ్లిరి. వారిద్దఱికొరకును బ్రీతిపూర్వక ముగ వేచియుండిన ముద్దులమోహాన సుస్వాగతమిచ్చెను. మోహానయు, సీతారామచంద్రుడును, యిరువురును గలసి హాలునందలి పట్టుకురిచీలపై యచ్యుతరాయునిఁ గూర్చుండఁ జేసిరి. సీతారామచంద్రుఁడు "నాపని నెఱవేరినది. ఇఁక నీవలసి నట్లొనర్చుకొ"మ్మని హెచ్చరించుటకుఁ గాబోలు మోహానకొక కనుసైగఁ జేసి యచ్యుతరావునుద్దిలకించి సోదరా! మీరిం దే యుండుఁడు. క్రింద నాకొక పనియున్నది. దానిం దీర్చుకొని యర్ధగంటకు లోపుగనే మిమ్ముగలిసికొందునని చెప్పి మేడ మీఁదనుండి క్రిందికి దిగిపోయెను.

ఇంక నీ నూతన యువతీయువకుల మనస్థితిం గూర్చి వర్ణింపసాధ్యమా? మోహననటనాసామర్థ్యము, నొయ్యారము, నది జేయుసపర్యలు, నా మోహన రూపవిలాసములా యచ్యుత రావు మనస్సును కలవరపఱచెను గాని "అయ్యో! నేనేల నీ విపదంబుధిబడిపోవుచున్నాను? మోహన నన్నెందులకిట్లు ప్రేమిం చుట? నేనా దీనికిలోబడుట. ఛీ! నేదీనిటక్కులకు దక్కునంతటి వేలనా?" యని తనమనస్సు గట్టిపఱచుకొనెను. అప్పుడు మోహన యానందమునకుఁ బరిమితిలేకుండెను. అచ్యుతరావు తాఁదలచినట్లిలు జేరి, పాదాక్రాంతుఁడగుటకు సిద్ధుడైయుండ మోహన యానందమునకుఁ బరిమితి యెట్లుండగలదు? తానా న్నియో విధముల కపటాభినయములఁ జేసెను. తనకులుకు వలపు జూపులతో నొక్కమారట్లు తళుక్కున మెరసి యచ్యుతరా యని ధృడమనస్సును బటాపంచలు గావించుచుండెను. పరమ తపోధనులగు ఋషితుల్యులే స్త్రీలలాలనలకుంజిక్కి బేలలైపోయి రని వెనుక సీతారామచంద్రునకు హితము గఱపియుండిన మనయచ్యుతరావు యువకుఁడుగదా ? వెనుకటి హితోపదేశ ములన్నియు మఱపుకురా మోహన తనతోఁ బలుకరించినఁ జాలునని దలఁచుచుండెను.

ఇట్లొక పావుగంటవరకా యువదంపతులు నిశ్చేష్టులై యుండ తియ్యనిఫలాహారములను, వేఁడికాఫీసీటిని దెచ్చి ప్రీతి పూర్వకముగ నచ్యుతరాయని కట్టెదుట నుండిన మేజాపై

మోహనయుంచెను. అదియే తనకత్యుత్తమమైన మయినదిగఁ దలఁచి జాతిగౌరవమును సహితము పాటింపక బ్రాహ్మణుఁ డయ్యునిరాటంకముగఁ గాఁజేసెను. స్త్రీసాహసమెంతపనికైనను బాల్పడ జేయును గదా? కాఫీత్రాగిన వెనుక నచ్యుతరావునకు నోటమాటయే రాలేదు. తదేకదృష్టితో మోహనను జూచు టయేపనియైపోయెను. వేడుకకై మోహన మఱుగువడినమఱల గనపడునంతదనుక బిక్కిరిచూపులఁ బిచ్చివానివలె మూలమూ లలఁ బరికించుచుఁ జూచుచుండెను. అల్లిమటఁగనంబడినఁ గను ముదంబందును. నాఁడుత్రాగిన వేఁడికాఫీనీళ్ళు తన్నాశకరమగు హాలాహాలముపగిది మాఱిపోయెను. సీతారామచంద్రునితో మాట్లాడిన యార్యచారిత్రములు, సుభాషితములు, నీతిబోధ నములు, నిపుడచ్యుతరావునకుఁ దలంపునకే రాలేదు. వచ్చినను నావార స్త్రీజాలమున దగుల్కొనిన యుక్తవయస్సుననుండి యతడేమి సేయఁగలడు? తటిల్లతా సదృశలావణ్యమయియగు నామోహనా సందర్శనమునకును, సుభాషితములకు నెక్కడి సంబంధము? కళాశాల–జనకలేఖాంతర్గతాజ్ఞలు– తన తెలివి తేటలు–నన్నియుఁ బాపపులోయలోఁ బడిపోయెను. మోహన యచ్యుతరావుతో గాని యచ్యుతరావు మోహనతో గాని యింతవఱకు సంభాషింపలేదు. అచ్యుతరావు మెల్లగనావడంతి నుద్దేశించి "సీతారామచంద్రునితో ననుఁజూడ నీవుద్దేశించి నట్లు చెప్పియుంటివఁట! కతమేమి?" మోహన "సుందరా

కారుఁడవగు నోయువకుఁడా! మీయందనురాగముంచి, మీకు దాసినై చరింపనుద్దేశించియే యిన్నింతపట్టుదలతో నాహ్వానించియుంటినిగాని మీరు విద్యార్థులగుటచే.........

అ—సుందరీ! ఏల యర్థోక్తియందే మాటను ముగించితివి? నేవిద్యార్థినను సంగతిముందే నీకుఁ దెలియకుండెనా? విద్యార్థి నయినంతనే నీకు గలుగు లోపమేమున్నది?

మో—ఆగర్భశ్రీమంతునికిఁ దనయులరగు మీ నెయ్యముచే నాకేలోపమును గలుగకున్నను, విద్యార్థి దశయందుండి భావికాలమున మహోన్నతదశ ననుభవింపవలసిన తాము నాపరిచయముచే నష్టపడినఁ బాపినై, పాపినై పోవుదునని మాత్రమే భయపడెదను.

అ—మోహనా! నాజీవితమునుగూర్చి నీకెందులకంతభయము? నీకు వివాహము గాలేదుగదా? నిరాటంకముగ నన్నుఁ గలసికొందువని తలఁచెదను.

మో—నేను వేశ్యను. అవివాహితను. నావృత్తాంతమంతయు సీతారామచంద్రరావు విపులముగ మీకెఱింగించి యుండునుగదా? వేశ్యనయ్యు నా పాండిత్యబలముచే వందల కొలది ధనమార్జించుచుంటిని గాని ధనాపహారణబుద్ధిఁ గలిగి కామోపభోగముల కాశించి, నేనితరుల కేరికి నింతవఱకు నాశరీరమమ్మియుండలేదు. రసికులగు మీకు మాత్రము.

అ—నాయందు నీకింతయనురాగముదయించి, నన్నానందింప జేయనున్నందులకా భగవానుని వేవిధములఁ బ్రార్థించెదను. నాయుదంతమంతయు నీ వెట్లుతెలిసికొంటివి? నన్నిదివరకెన్నడైనను జూచియుంటివా?

మో—తాము మరచితిరి గాఁబోలు. సుమారారు మాసముల క్రిందట మైలాపురమున హైకోర్టు న్యాయవాదులగు వేంకట రామశాస్త్రిలుగారి కుమారునకు జరిగిన వివాహ సమయమున నా మేజువాణిజరిగినది. అప్పుడుమీరందుంటిరి గావున, మిము బాగుగా గుర్తించి మీవిషయమంతయు నక్కడివారల నడిగి తెలిసికొనియుంటిని. తమతో నాసమయమునఁ గలిసి మాటలాడఁ దలఁచితినిగాని వలనుపడ మిచే ఆనాఁటినుండియు నా నిరంతరకృషిచే శ్రీ సీతా రామచంద్రుని సాయమున నాకోర్కెలీడేర నేఁడుగదా మిముఁజూచు భాగ్యము నాకు లభించెను.

అ—ఆనాఁటి మోహనవా నీవు? నినుగూర్చి నాఁటి సభికు లందరు మెచ్చుకొనియుండిరే?

మో—వారి మెప్పులతో లాభమేమున్నదండీ? మీ మెప్పేనాకు మహాభాగ్యమని మందహాస మభినయించుచు శయ్యా గారముజేరెను.

అచ్యుతరావిందిరియఁసుఖము నభిలషించి మోహనకుఁ బూర్తిగా వశ్యుఁడైపోయెను. ఆమె వెంటనంటి హంసతూలికా

తల్పమునకు దప్పుననే యమర్పబడియుండిన సోఫాపై గూర్చుం
డెను. మోహనయు నటనుండిన వీణను దీసి శ్రుతినిగూర్చి
"తొలినేజేసిన పూజాఫలమున" యనుత్యాగరాజకృతిని బాడఁ
దొడంగెను. రాగమాలాపించి పల్లవిఁబాడునరికే యా మృదు
మధురగానము యచ్యుతరావు దేహమును బులకరింపజేసెను.
పాడుచుండునది మోహనయా? వినుచున్న దచ్యుతరావా?
యనుసంగతియే యాతనిస్మృతి పథమునకురాకుండెను. వేయేల?
ఆతఁడు పరవశుఁడైపోయెను. సంగీతము సర్వజనరంజకమయి
నది. గనుక దానిని మృదుమధుర స్వరముగల సుందరులు
నృత్తగీతాదులఁ జేర్చుకొని, హస్తాద్యభినయములతో తాలు
కలుగునట్లుగాఁ బాడునవు డాస్థలము భూతల స్వర్గముగాక
యుండునా? సంగీతమునందట్టి యద్భుత జగన్మోహనశక్తి
యున్నదనుట మన మోహనాచ్యుతరావులసంబంధము బుజావు
పఱచుచుండెను. సంగీతమొక్క మనుష్యులను మాత్రమేగాక
చెవులుగల సమస్తజంతువులనుగూడ నానందింపజేయఁగలదు.
అందుచేతనే మనపెద్దలు "శిశుర్వేత్తిపశుర్వేత్తి గానరసః
ఫణిః" యను యార్యోక్తి యతిశయోక్తిగాక స్వభావోక్తియని
నుడువుటయందు వింతయేమున్నది? సర్వజన మనోహరమైన
యాసంగీతము నధిక మార్దవమును, మాధుర్యమును గలిగి
యర్థముల బోధించు హస్తాభినయమును, హావభావముల
బోధించు నేత్రాభినయమ్మును, బ్రకటించుచు మోహన
యచ్యుతరావును దనచేతి కీలుబొమ్మవలె నాడింపసాగెను.

అచ్యుతరావునకుఁ గొంచకొంచముగ స్మృతిగలిగెను. మోహన మాత్రము మిగుల రసవంతముగఁ బాడుచునే యుండెను. స్మృతి గలిగిన తోడనే నీవిపదంబుధి నేఁ దగులుకొనవచ్చునా? వివేక కల్పలతకుఁ గరవాలమగు వారాంగనలు పొత్తుగలిగించుటకా యీయధమాధముండగు సీతారామచంద్రుడింతటి పన్నాగము పన్నను? ఛీ! మనమా! నీ తెలివి యెందుబోయెను? నీకిం దేమిపని? యనిదనమనంబునదలపోయుచు మరల మోహన ముఖకమలము బరికించెను. దాని పాటలు జితేంద్రియులకైన నున్మాదముపుట్టించు కామశాస్త్రిక బోధనములుగనుండ నట్టి సమయములో నచ్యుతరావు మనస్సెట్లు సంచలింపకుండును. నీతిపూరితమగు తనయోచనాబంధ మంతటితో బటాపంచలైపోయెను. సోఫాపైనుండి మెల్లగలేచుచు మో–హ–నా– నన్నేల యిట్లీ యగ్నింబడి కాల్పజేసెదవని మోహనపయిఁ బడబోయెను.

ప్రియతమా! ఏల నంతగ వంతఁ జెందెదరు? నేనెద్దాని నాశించియుంటినో, దానికేగదా మీరాతురపడుట? యని మోహన యచ్యుతరావును గాఢాలింగన మొనర్చుకొనెను. మోహపరవశత్వముచే వారిరువు రాహంసతూలికాతల్పముపై బడిపోయిరి. వేనకువేలు వ్యయముగావించి చదువుచుండిన విద్యాపటిమయు, పితృభక్తియు, తన నిర్మలబుద్ధియు, పరువు

ప్రతిష్టలన్నియు నాఁటితో— మోహనా సంపర్కముతో నగాధమున బడిపోయెను. అచ్యుతరావుగూడ మోహనాప్రేమ సంద్రమున విలీనమైపోయెను. మోహావేశ పరవశుఁడై యాత డారాత్రియంతయు దానియింటనే గడపెను. తనకితరచింతయను నది లేశమాత్రమయినను గనపడలేదు. మోహనయే తనపాలిటి కల్పతరువుగనమ్మి బేలయైపోయెను. ఆతనిచిత్తమును మఱింత నంచలింప నిందిౖయములోలుఁడైన యచ్యుతుఁడు తన్ను మోహన కొప్పగించుకొనెను. వివేకము బూర్తిగ గోల్పోయెను. సీతా రామచంద్రునిం గూర్చి తనకపుడు జ్ఞప్తియేలేదు. ఆతని విషయము గూడ నానాఁడు దెలియలేదు.

---

## ఏకాదశ తరంగము.

అచ్యుతరావట్లే రెండుమూఁడురోజులు వారాంగనయగు మోహనయింటియందే గడపెను. తనప్రేమాస్పదమగు కళా శాలయందలి తోడిబాలురు విస్మృతులైరి. అచ్యుతరావు కళాశాలకుఁబోక విరమించిన కారణ మారయుటకు పలువు రాతని బసయొద్దకువచ్చుచుఁ బోవుచుండిరి. తనయనుంగుచెలి కాఁడగుటచేఁ గులశేఖరమునాయుఁడు దినమునకు రెండుమూఁడు పర్యాయములు వచ్చుచుఁ బోవుచుండెను. కళాశాలయందలి విద్యార్థులేగాక ఉపాధ్యాయులందఱు సెబాసని పొగడుచుండ

విద్యార్జనము గావించుచుండిన యచ్యుతరావు మోహావేశుఁ డయిపడి యల్లాడుచుండగా విద్యార్థులకెట్లు దర్శనమీయ గలఁడు ? నాలుగవనాఁ డచ్యుతరావునకు మోహాన సంపంగి తైలమునఁ దలయంటి శిరస్నానము జేయించి పంచభక్ష్య పరమాన్నములచే నాతనిఁ బరితృప్తుఁ గావించెను.

నాథా! నాకన్నియాభరణము లున్నవిగాని బంగరుబడ్డాణము మాత్రములేమిచేఁ జాలకొఱంతగ నున్నది. అధమము వేయిరూప్యములకుఁ దక్కువమైన నది సమకూరదు. తామతి శీఘ్రముగ దయారుచేయించి ప్రసాదింప వేఁడికొనియెదనుం అచ్యుతరా వత్యాహ్లాదంబున మోహానమెడపైఁ జేయివైచి రాగవల్లరీ! అంతమాత్రమునకా ? నీకట్టి యొడ్డాణములెన్నియైనఁదయారు జేసి యిత్తును కానిమ్మని యొకజట్కా కుదుర్చుకొని తనబసకరుదెంచి తనతండ్రి బంపియుండిన యైదునందల రూప్యములును, తానపుడుఁ జేర్చియుంచిన మూలధనము మూఁడువందల రూప్యములును గలిపి మొత్తము యెనిమిది వందల రూప్యములు నామోహాన కర్పించెను. మిగత రెండు వందల రూప్యములకని తనచేతియందలి వజ్రాంగుళీయకమును దీసి యియ్యబోయెను గాని కపటశీలయగు తనస్నేహితుని వారించుచు నయ్యో! మీకులేనిశృంగారము నాకెందులకు? ఉండనిండని చెప్పి యాతడిచ్చిన మొత్తమును మాత్రమే స్వీకరించెను.

ఇఁక నెక్కడి యచ్యుతరావు? మోహాంధకారమునఁ బడి మునిఁగిపోయెను. తన బసను "జహాంగీరు వీధినుండి" తిరువత్తియూరు హైరోడ్డు మోహనా గృహమునకు మార్చుకొనెను. కళాశాల మాటయుఁ దండ్రిగారంపమన్న వస్త్రముల మాటయు, కులశేఖరుని చెలిమియు, నచ్యుతుఁడు పూర్తిగ మఱచిపోయెను.

మఱి రెండుదినములు చనినపిమ్మట మోహన దాక్షిణ్యమేమియు లేక "బన్నారస్ చీర" నొకదానినిఁ గొనిపెట్టుమని యచ్యుతరావును మెల్లగఁ బీడించెను. అధమము రెండు వందల రూపాయిలైన వెచ్చించి కొననిచో నది చీరయే గాదనియు, నొకమాటఁ జెప్పెను. అందుల కాతఁడేమి సేయఁగలఁడు? చేతనొక కాసైనను లేదు. ఎట్లో తయారుఁజేసి యిచ్చెదనని చెప్పి తన పూర్వపుబస యొద్దకు వచ్చెను. ఆ యింటివారాతనికి వచ్చియుండిన కొన్ని యుత్తరముల నిచ్చి మీకేదో నొక తంతివార్త యిపుడే వచ్చినది. మీరిందు లేనికారణమున వార్తాహరుఁడు దానిని వాపసు తీసికొని వెళ్ళినాడండీ యని చెప్పిరి. ఆనాఁటియుత్తరములలో గొన్ని తన మిత్రులు వ్రాసినవిగను, నొకటిమాత్రము తన తండ్రి గోపాలరావుగారాగ్రహముతోఁ దక్షిణమే వస్త్రములఁ గొనిపంపుమని వ్రాసిన యుత్తరమునై యుండెను. తంతివార్తఁ గొను

నాసతోఁ బోస్టాఫీసున కరుదెంచి దానింగైకొని చూచెను. అందిట్లుండెను.

"నీ తండ్రి గోపాలరాయఁడీదినము పాముకాటుచే నాకస్మికముగ మరణించెను. నీవు తత్క్షణమే రావలయును."

వేంకట లక్ష్మమ్మ.

ఈ వార్తగాంచినదే యచ్యుతరావు గుండెబాదుకొనుచు నట్టె మూర్ఛితుఁడైపోయెను. తండ్రీ! నన్నీ విపత్సాగరమునఁ బడద్రోసి పోయితివా? యని పలువరించెను. దుఃఖాక్రాంతుఁడై మోహనాలయముఁ జేరి తన జనకుని నిర్యాణ వృత్తాంతమంతయు నాగభూషణమ్మకు నెఱింగించెను. తండ్రి యెస్టేటున కతఁడు తనతండ్రి యనంతరము సర్వాధికారి కాఁగలఁడు; మనమాతని పకీరుఁజేసి యంతయు దిగమ్రింగుదమను సంతసముతో మోహన లోలోన మురియుచుండినను, పైకి మాత్రమామె దుఃఖ మభినయించుచు, నయ్యో! తామీ బాల్యావస్థయందే తండ్రిని గోల్పోయి దుఃఖపడవలసి నట్లా భగవానుఁడు చిత్రించెనుగదా? యని చింతించెను. తన దుఃఖమును గూడ నాపుకొని యచ్యుతుఁడా మోహనను హితవచనములతో బుజ్జగించుచుండెను. నాఁటిరాత్రియే కలకత్తా మెయిలుబండికిఁ దన స్వగ్రామమగు "తాడేపల్లి గూడెము" నకు బయనమగుటకు నిశ్చయించుకొనెను గాని

మోహనను వదలిపోవుటకు మాత్రమాతని మనస్సొల్లకుండెను. తనకుఁ దలవని తలంపుగ దుఃఖము సంభవించినను మోహనా సందర్శన మాతని కానందముగనే యుండెను. ఆనాఁడెన్నియో సారులామెను ముద్దిడికొనియెను. నే నూరికిఁ బోయివచ్చెదను సుమా! నాయభివృద్ధి కనారతము పాటువడుచుండు దైవతుల్యుఁడగు తండ్రిం గోల్పోయితినే. అయినను నన్నుద్ధరింప నీవున్నావుగదా! యని పలువరించెను.

సాయంతనము గావచ్చుచుండుటచే ప్రయాణమున కాయత్తపడుచుండెను. తనకుండిన మాటయు ముల్లెయు వేశ్య కప్పగించుటచే బ్రియతమయగు మోహనయొద్ద బదునైదు రూపాయలెరవుగ లభించెను. మఱువకుమా! నీవే నాబహిః ప్రాణమవుయని మఱియొకమాఱు మోహనను ముద్దిడి గాఢాలింగనమొనర్చుకొని యామె సెలవందికొని సెంట్రల్ స్టేషనున కొక జట్కా కుదుర్చుకొని యాతఁడు వెళ్లెను.

చూచితిరో యచ్యుతరావునకు సంభవించిన మహాదుర వస్థ! వేశ్యలపొందు తాత్కాలిక సుఖముమాత్రమే యిచ్చునని యెఱిగియు మనవారెందరీ యన్యాయమునకు లోనై మ్రగ్గుచున్నారో కండ్లారజూచిన నీకు దెలిసిన యంశమేగదా? ఇన్నింటి కచ్యుతరావుపాలిట భూత మ్మా శీతారామచంద్రుఁడే! పాపపు సాగరమ్మునఁబడి పొరలుచుండు నచ్యుతరావు తనతండ్రిని గూడ

గోల్పోవుటఁజూడ నతని జీవితమిఁక దురవగాహమై దురవస్థా బంధురమై పోవుట కేగదా ? అనుదినము సీతారామచంద్రుఁడీ యుదంతమంతయుఁ గనుచు వినుచుండెడివాఁడు. అచ్యుతరావు మోహన యిలువెడలిన నాఁడే నాతఁడేగుదెంచి మోహననుఁ గలిసికొని తానిదివఱ కచ్యుతరావును సేవసముచేసి యిచ్చి నందులకుఁ బ్రతిఫలముగ నేర్పఱచుకొనిన కట్నము రెండువం దలయేబది రూప్యములు మోహనవలన సంతసమున గైకొ నెను గాని యందలి నూఱురూప్యములా సుందరికిచ్చి నాటిరేయి యంతయు నందేయుండి కామోపభోగములఁ దేలియాడు చుండెను.

సెబాస్ ! నీసుభాషితము లన్నియు మఱచితివా ? యనియు దానచ్యుతరావు విషయమునఁ బడిన శ్రమమంతయు మోహన కెఱింగించుచుండెను. ఆహా! ఎనిమిదివందల రూప్యము లొక తృణకాలమున నచ్యుతరావుకడ సంగ్రహించియు నాతని యందు లేశమాత్రమైన విశ్వాసముంచినదా ? నాఁటిసుభాషి తోపదేశములు వమ్ముగాకపోయెఁ గదా? నూఁఱురూపాయ లిచ్చిన సీతారామచంద్రుఁడును దనకు మేటి విటుఁడాయెగదా? ఇవియే వారకాంతా విలాసినీచేష్టలు. ఆహా! ఈవెలవెలందులు కులనాశకులగు పెనుభూతములుగదా? పరపురుష సాంగత్యము మోహనకులేదని యచ్యుతరావుతో పలుమారు నచ్చఁజెప్పిన సీతారామచంద్రుఁ డానాఁడు నూఱురూపాయలిచ్చి మోహనా

సంగమ మొనర్చుటఁ జూడ వతఁడెంతటి కృతకకర్ముఁడో పాఠకులూహించుకొనఁగలరు.

---

## ద్వాదశ తరంగము.

మరుదినముదయము పదిగంటల కంతయు అచ్యుతరావు స్వగృహము చేరెను. తన జనని వేంకటలక్ష్మమ్మయు, సోదరి లక్ష్మీబాయమ్మయు, బావమఱదియగు వెంకటేశ్వరరావును నాయింటఁజేరి రోదనముఁ జేయుచుండిరి. అచ్యుతరావు సమీప బంధువులును, నౌకరివెంబడినౌకరుగవచ్చి గుంపుఁజేరి విద్యార్థిగ నుండు నచ్యుతునకు జనకుని నిర్యాణముచేఁ గలిగిన విపత్తున కెంతయుఁ జింతించుచుండిరి. అచ్యుతరావు గూడఁ దన తండ్రిం గూర్చి తలపోసికొనుచుఁ జింతించుచుండెను. ఆనాఁడు గోపాల రావు పంచయనకార్యములు యథావిధిగ జరిగిపోయెను. కుటుంబోద్ధారకుఁడగు గోపాలరావు మరణముచేఁ దన తల్లియు, సోదరియు, బావమఱదియు మిగుల దురపిల్లుచున్నను, నచ్యుతు నకా మోహానపిచ్చి యేమాత్రమును వదలలేదు. తన తల్లిని హితవచనముల నూఱడించుచు, ఖజానాబీగమును మాత్రము మెల్లగ నందికొనెను. అతనితల్లియు నాతనినుద్దేశించి నాయనా! అచ్యుతా! నీతండ్రి నినువిడనాడి పోయెను. నీతండ్రి యభిమత మెట్లుండెనో అట్లే యాంగ్లవిద్యాకోవిదుఁడవు గమ్ము. మన

సొత్తున కంతయు నీవె సర్వాధికారివై ప్రజలు నినుఁ బొగడు నట్లు చరింపుము. అపుడే నీవు నీజనకుని పేరుప్రతిష్ఠలు నిలిపిన వాఁడవగుదువు. అని మొలుగెత్తి యేడ్వసాగెను. కష్టసుఖములు కావడికుండలవంటివి గదా ! దుఃఖింపకుము. నేనుండ నీకేమి కొదువ యని బుజ్జగించి తండ్రిగారి దశాహాస్సునకును తరువాత కార్యములకును సంబారములు బావగారితోఁ జెప్పి తన యింటియందొక మూరుమూలనున్న "యినుపపెట్టె" ను దెఱచిచూచెను. అందిరువదివేల రూప్యముల నగదును, పదివేల రూప్యములు విలువఁగల నగలును బదిలపఱుపఁబడి యుండెను. కన్నకష్టములంబడి గోపాలరావు సంపాదించి యుండిన యా భాగ్యముఁ జూచినతోడనే యచ్యుతరావానందపరవశుఁడై పోయెను. తా నివసించుట కొక పెద్దమేడయు, కృష్ణకాలువ క్రింద సుమారిరువదివేల రూప్యముల వెలచేయఁగల మాగాణియుఁగూడ గోపాలరావు సంపాదించి యుండెను. మొత్తమున కన్నియు గలిసి సుమారేబదివేల రూప్యములకుఁబైగ కిమ్మతు చేయుగల యాస్తి గోపాలరావు చనిపోవునప్పటికి నుండెను. ఇనుపపెట్టెనుండి యైదువేలరూప్యముల కరెన్సీనోట్లు తీసి మణి పర్సు నందుంచికొనెను. వాటికితోడు కొంచెము చిల్లరయుఁ దీసి యుంచుకొని తల్లివద్దయాజ్ఞఁగొని చెన్నపట్టణమునకుబయలు దేరెను. రైలుబండియందెక్కినదాదిగ నాశకటమునకంటె వేగముగ నాతని మనస్సు మోహన యొద్దకు బరువులెత్తుచుండెను.

నియమిత కాలమునకు సరిగ ధూమశకటము చెన్నపట్టణమం దలి విశ్రమస్థానమును (స్టేషను) జేరెను. అచ్యుతరావా వెంటనే మోహనసదనముఁ జేరి దానిం గలిసికొని యత్యాతురమున నొక ముద్దు పెట్టుకొనెను. ఆముద్దు తనభావిజీవితమునకు ముద్దుగా దోఁచెను. ఇరువురును గుశలప్రశ్నములు గావించుకొనిరి. ఆ సాయంతనమే మోహనాచ్యుతు లిరువురును బాడుగ మోటారును సిద్ధపఱచికొని నగరమందలి నానావిధ ప్రదర్శన ములఁగాంచిరి. బీచి చల్లనిగాలియు ననుభవించిరి. వస్త్రవిక్రయ శాలకేగి కాశీజల్తారుపట్టుచీరెలు, జరీబుటేదారి రవికెలు మున్నగు విలువగల వలువలు వేయిరూపాయలవరకు వెచ్చించి యచ్యుతరావు మోహనకు దీసియిచ్చెను. ఆ సమయమున నచ్యుతరావు తెగువ మితిమీఱి పోవుచుండెను. పదిరోజులట్లే మోహనాస్నేహ సమ్మోహితుఁడై ద్రిమ్మరుచు మిగతనాలుగు వేల రూప్యములుఁగూడ నాబిడకు సమర్పించెను. అప్పటి మోహనసంతోషమును గూర్చి వేరుగ వర్ణింపవలయునా? పరద్రవ్యాపహారిణియై తనదేహమమ్మి సంపాదింప నుంకించిన దానిసంతోష మనుకొనిన దానికన్న వేయిరెట్లధికమయి పోవు చుండెను. ఈ సమయముననే యచ్యుతరావును బకీరుగావించి యావదాస్తిని యాతనినుండి సంగ్రహింప నెన్నియో పన్నాగ ముల బన్నుచుండెను. అచ్యుతరావు మోహనాసమ్మోహనాస్త్ర నిబద్ధుఁడై పడియుండెను. కాని తనతండ్రి దశాహము గూర్చి

స్మరణకు దెచ్చికొనిన వెంటనే తనగ్రామమునకు బయలు దేరెను. జనకునివియోగమును గొంచెమైనగమనింపక నచ్యుత రావు వారకాంతావిలాస చేష్టలయందు దగుల్కొని సంత సించుచుండినను, దన తల్లిమాత్రము భర్తృవియోగముచే నానాటికి శుష్కించి పోవుచుండెను. సుమారు వేయిరూప్య ములకుఁ బైగ వ్యయమొనర్చి యచ్యుతరావు గోపాలరావు గారి యుత్తరక్రియలు బూర్తి చేసెను. అచ్యుతరావు కార్య కర్తగనుండి వితరణగఁగార్యములు పూర్తి చేసి, కొన్నిదినములు స్వగృహమున గడపుటకై తాడేపల్లిగూడెమున నుండెను. పదునయిదు రోజులుమాత్రమే యందుండఁగలిగెను. ఆపక్షము దినములకే మోహన మైదారుత్తరములు వ్రాసియుండెను. మోహనయాహ్వానబలముచే మరల నచ్యుతరావుమదరాసుకు బ్రయాణమయ్యెను. అమాయకురాలగు తల్లి తనకుమారుఁడు చదువుచున్నాఁడనియు, సీతూరి బి-ఏ తరగతియందుఁ గడ తేర గలడనియు నువ్విళ్లూరుచుఁ దానును దొందఱపఱచి కుమా రుని మదరాసునకు వెళ్లుమని ప్రోత్సహించెను. ఇనుపపెట్టె తన యధీనమందుండు నంతదనుక తన కేమి కొదువ? మరియైదువేల రూప్యములు చేతఁబట్టికొని చెన్న నగర యాత్రాభిముఖుఁడై బయలుదేరెను. చెన్ననగరముజేరి మోహనయొద్ద కట్టె బోక నేరుగ మౌంటురోడ్డునందలి "శిమ్సకంపెని" కి వెళ్ళి నాలుగు వేల రూప్యములకు "మాక్సువెల్ మోటారు" నొకదానిని గొనెను. అందుకు సారథినిఁ [డ్రైవరును] గూడనొకనిని మాస వేతనమునకు గుదుర్చుకొనెను. అచ్యుతరావు మోటారుకారునం

దాసీనుఁడై మోహనామందిరముఁ జేరెను. మోటారుబండియం దరుదెంచిన ప్రియనాథుని మోహన మిగుల సత్కరించెను. వారిరువురును మేడమీదికి వెళ్ళిరి. అచ్యుతరాయని పరిస్థితులం బరికించిన నెంతటికఠినచిత్తునకైనను కన్నులనీరు గారకుండునా? తన కళాశాలసంగతిని మోహనా ప్రథమ సందర్శనముతోనే మఱచిపోయెను. పరీక్షలును జరిగిపోయినవి. తనతోడివిద్యార్థులు కులశేఖరమునాయుడు గూడ పరీక్షయందు గృతార్థుఁడయ్యెను. మన యచ్యుతరావు పూర్వదశ యందుండిన శ్రీయుత పి. అచ్యుతరావు బి. ఏ. గారైయుండురుగదా? ఆతనికా యదృష్టములేదు కాఁబోలు. మోటారుకారుగాని మిగిలిన వేయి రూపాయలుగూడ మోహన చేతికిచ్చివేసెను. మూఁడుమాసముల వఱకా యచ్యుతరావు మోహన యింటియొద్దనే యుండెను. మూఁడు మాసములకుఁ దొంబది రూప్యములు మోటారుడ్రయివరునకు మోహన యిచ్చెంగాని యాపైని తన కాపని యనిష్టముగఁదోఁచెను. ఇఁక నాతనివేతనము మీరిచ్చుకోవలసినదే నాకు సాధ్యము కాదని యచ్యుతునితోఁ దీవ్రముగాఁ బలికెను. నాముద్దుల మోహనా! నీకెందులకాశ్రమము? వాని వేతనము నేనిచ్చెదనని చెప్పి వారిరువురానాఁటి సాయంతనము మోటారునఁ గూర్చుండి "తిరువత్తియూరు" నందలి త్యాగరాజస్వామి యుత్సవమ్ముం జూచుటకుఁ బోయిరి.

---

## త్రియోదశ తరంగము.

మోహనా సందర్శనమైన దానివలపు చే మాయలోఁ బడిపోయిన నొక వత్సరమున కంతయు నచ్యుతరావు యావ

దాక్షి—స్వంతయిల్లు, రెండెకరముల మాగాణియు, దప్ప మిగిలిన దంతయు మోహాన కర్పణము గావించెను. మోటారు మాత్రి మల్లే యుండెను. దానిని సైతము విక్రయింపుమని మోహాన యచ్యుతరాయని దొందరపఱచుచుండెను. అందుకు "వల్లె' యని యచ్యుతరావాబండిని మనస్సునఁ గటకటం బడుచు మూఁడువేల రూపాయలకు విక్రయించెను. తన్ననవరతము 'నీకు మోహాన నర్పించితినే నాకేమైన సాయము జేయువా'యని కఠినహృదయుఁడై యప్పుడప్పు డడుగుచుండిన మహాపాపియుఁ గఠినాత్ముఁడు నగు సీతారామచంద్రున కైదు వందలరూప్యములిచ్చి మిగిలిన సొమ్మునఁ గాసైనను జెదరనీక పదిలముగ మోహానకిచ్చెను. గ్రామమందు జనులీతని దుశ్చరితమునంతయు దెలిసికొని గుండె లవియునట్లు దుఃఖించుచుండిరి. కొంపమైన దక్క—నియ్యవా? అచ్యుతా ! నీ వెంతకుల నాశకుఁడవై తివిగా ? నీ తండ్రియాస్తి యెంతకష్టపడి- రామ ! రామ !! చెప్పనలవియా ! ఎన్నిశ్రమలుపడి సంపాదించి యుండెనో కదా ! నీవొక పదిమాసములకే కొంపనాశముఁ జేసితివే? నీ వెంతయో నీతిశాలివనియుఁ, బ్రతిభావంతుఁడ వనియు, నూరివారును, నీ తండ్రియు, నప్పుడప్పుడుఁ బొగడుకొనుచుండిరే. హా ! ఎంతటి దుశ్చరితము! దైవమా! సాకిఁక వేరేమిగతి ? యని పలవరించుచుండెను.

రైలు సౌకర్యమున్నందునను, జాలినంత పైకము చేత నుండినందునను నచ్యుతరావు తాడేపల్లిగూడెమునకు, మదరాసునకు మంచినీళ్ళ మర్యాదగ వచ్చుచుఁ బోవుచుండెను. నాఁటి వేంకటలక్ష్మమ్మగారి దుఃఖమంతయు గూడ నచ్యుతరాయఁడు వినియే యుండెను. వినినను దనకావిషయము దలకెక్కునా ? వేశ్యామృతము విషమయమై అచ్యుతరావు మేనెల్లయుఁ బ్రసరించి యుండెను. తన సోదరియు, బావమరదియు కాకినాడనుండి తాడేపల్లిగూడెము వచ్చియుండిరి. సోదరి యన్నగారిని దుష్ప్రవర్తనము నుండి మరలుమని బ్రతిమాలుకొనెను. అన్నా ! నీవొకఁడవు మన తండ్రిగారికి సుతుఁడవైనందునగదా నీకింపనిట్లు వమ్మునర్ప సాహసించితివి? నేను నీవలె పురుషుఁడనై యుండిన నీవిట్లాడుటకు సాహసింతువా ? సాహసించినను నీసగభాగమే గదా నీకుఁ జెల్లును! మన తండ్రిగారెంత పేరుప్రతిష్ఠలతో బ్రతికిరో నీవును నంతకన్న మిన్నవగుదువని మేమానందించుచుంటిమి. మాయానందము బూడిదను బోసిన పన్నీరు పగిదియయ్యెనే? మాయాసలన్నియు నడియాసలుగ నడుగంటఁ జేసితివే ? నీవిద్యాక్రమము - నీపట్టుదలలన్నియు వేశ్యాంగనా పొత్తునకు బలి నొసంగితివే ? అయ్యో! అన్నయ్యా వేనకువేలు రూప్యములు వారకాంత కప్పగించుటకు నీమనస్సెట్లాడెను? సోదరియగు నన్నైన గమనించితివా? ఊరివారందఱు నీచారిత్రముందలఁచి యుపహసించు

చున్నారే ? నీకివన్నియు న్యాయముగ నున్నవా ? యని యచ్యుతు పాదములపైఁబడి యేడ్వసాగెను. వెంబడియే యుం డిన జననియు ముఖమున గుడ్డఁగప్పికొని బిగ్గరగ నేడ్చు చుండెను. అచ్యుతరావున కప్పుడేమియుఁ దోఁచలేదు. తానును మెలుఁగత్తి యేడ్వసాగెను. తన జీవిత మధోగతి పాలగుచున్నదని యేడ్పులచేఁ గనుఁగొనెను గాని మోహన రూపము మాత్రము తనయంతరాత్మయందుఁ బ్రతిఫలించు చుండెను.

అయినను వెంటనే తెలివిఁ దెచ్చుకొని "సోదరీ ! ఏలవగచెద"వని తనసోదరి నూరడించి యప్పుడే మిగిలియుండిన రెండెకరముల భూమిని సోదరిపేరిట శుద్ధవిక్రయముగ వ్రాసి రిజిస్టరుచేసి యిచ్చి, యామెతోడఁ దల్లిని కాకినాడకు బంపి వైచెను. లక్ష్మిబాయమ్మ భర్తయగు వేంకటేశ్వరరావు కాకి నాడ సబ్ కోర్టులో శిరస్తాదారుద్యోగమున నుండుటచే లక్ష్మి బాయమ్మ జీవితము సుఖముగనే యుండెను.

అచ్యుతరావున కేమున్నది? సుమారు పదివేల రూప్య ములు వెచ్చించి గోపాలరావు గట్టించి యుంచిన మహిడీ యొక్కటి మాత్రమే మిగిలియుండెను. తల్లిని సోదరి యింటికిఁ బంపివేసెను. అదియు దన కమిత సంతోషముగ నుండెను. అచ్యుతరావునకుఁ బైకము గావలసి యుండుటచే మహిడీ

విక్రయింపఁ దలఁచెను. ఆ మొత్తమున కడుగువారెవ్వరును గాన్పింపలేదు. ఎంతెంతో గృషిఁజేసెను. ఆయూరియందలి కొందఱార్యు లీతనికి హితము గఱపి గృహవిక్రయము మాపఁ జూచిరి; కాని మన్మథోద్రేకముచే మత్తెక్కియున్న యచ్యుతరావు బుద్ధికా విషయమెక్కలేదు. ఆయూరి వారందఱుఁ గూడ నాతని దుశ్చరితముంగూర్చి పలుభంగులఁ దలపోసి కొనుచుండిరి. జన్మభూమియగు తాడేపల్లిగూడెమున తాను విద్యార్థి దశయందుండిన కాలపుగౌరవమావంతయుఁదనకగపడ లేదు. ఆవిషయమైనను దాను గమనించెనా? ఆతని జ్ఞాపకమంతయు మోహానయందే లీనమై యుండెను. పరువు ప్రతిష్ఠలు తన కక్కఱలేనట్టే యగపడుచుండెను. మోహాన తన్ను ధరించుననియు, నది తననుదప్ప యితరులఁ గన్నెత్తిమైనఁ జూడదనియు యథేచ్ఛగ నేయాటంకమునులేక చెన్నపట్టణమందా బహువిధ పుష్పతరుచ్ఛాయలయందుఁ దేలియాడుచు, నట్టి మోహానతో దానిమందిరమునఁ గాలముఁ గడుపవచ్చుననియు నచ్యుతరావు మిగుల నమ్మకముతో నుండెను.

నాలుగైదు రోజులు నిరంతర కృషిచేసి తుదకొక వర్తకునికి తనమేడ నైదువేల • రూప్యముల కిచ్చునట్లు బేరమును గుదుర్చుకొనెను. పంచసహస్ర రూప్యములు చేతికిఁ దీసికొని విక్రయదస్తావేజు • వ్రాసియిచ్చి, రిజష్టరీయయితము జేసియిచ్చెను. నేటితో నచ్యుతుఁడు జనకార్జిత సర్వస్వమును

గోలుపోయెను. పకీరయ్యెను. భావిజీవితాలోచన యనునది యేమాత్రములేక, మోహనయే తనకు పెన్నిధానమని తలంచి ఘోరాజ్ఞానాంధకూపమునఁ బడిపోయెను. తాడేపల్లిగూడెమును మఱచి తన సర్వస్వమ్మును గోలుపోయి యచ్యుతరావు చెన్న పురమునకు బయలుదేరెను. నియమిత కాలమునకు ధూమ శకట సాహాయ్యమునఁ జెన్నపురి జేరెను. మోహానను గాంచెను. ముదంబందెను. ప్రేమమీఱ ముద్దిడుకొనెను. కౌఁగిలించు కొనెను. వేళపాళల గమనించక మోహనతో రతులందేలెను. మోహాన ధనపిశాచమగుటచే నాతని సర్వస్వము నపహరింప యెన్ని విధముల నైనను జగింపసిద్ధముగ నుండునుగదా! అచ్యుత రావా పంచసహస్ర రూప్యములను దనయొద్దనే యుంచుకొన దీర్మానించుకొనెనుగాని మోహాన నాఁటిరాత్రియే నీకిదితగదని కాఁబోలు బుద్ధిచెప్పి కాసులెల్ల నూడఁబెఱికికొనియెను. ఱాలను గూడఁ గఱగఁజేయించునంతటి చతురయగు మోహానగాన మాతని హృదయము సంచలింపఁజేయుచుండ దానియొక్క శృంగారవు వలపుఁజూపు లాతని మనస్సును సంచలింపఁజేయు చుండ నెట్లు వేశ్యాకాంతలయొద్ద ధనము దాచియుంచికొన గలఁడు. మఱికొన్నాళ్లు మోహాన అచ్యుతరావు కెన్నియో విధముల శుశ్రూషఁ జేయుచుండెను. ప్రతిదిన మా యిరువురు విహారార్థము వెడలివచ్చిన పిదపఁ దన గానమాధుర్యముచే మోహాన యాతని కెంతయో హాయిని గల్గించుచుండెను. ఈ

సుఖానుభవము జీవితపర్యంతము నుండఁగలదని యాతఁడు నమ్మి యుండెను. "తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచు"నను నార్యోక్తి వమ్ముగాలేదు. తన కోరికలన్నియు యడవిని గాచిన వెన్నెల చందమునఁ బరిణమించిపోయెను.

"సీ॥ తారాచలము త్రవ్వి తలకెత్తిననుఁగాని
వారసుందరి కాశ తీరబోదు
కనకాచలముఁదెచ్చి కానుకిచ్చినఁగాని
ధనమోహనాంగికి దనివిలేదు
ఒడలెల్ల బంగారు తొడుగుఁజేసినఁగాని
భోగభామకు దృష్టిఁ బొడమబోదు
విలువలేని పసిండి వలువలిచ్చినఁగాని
గణికామణికిఁ దృష్టి గలుగబోదు

తే॥ ధనకనక వస్త్రములనిచ్చి ధనదుఁడైన
విత్తకాంతను సంతోషపెట్టలేఁడు
ఆటవెలదికి స్నేహమోహములు లేవు
................................"

అనునట్లు వేనవేలొక్కని నుండి యార్జించియు నానాఁటి మోహాన యనురాగ మచ్యుతరావుపట్ల సన్నగిలుచుండెను. ఒక్కసంవత్సరములో నలువదివేలరూప్యములచ్యుతరావునుండి సంగ్రహించి యాతని విపుల జీవితమును నాశ

మొనర్చిన కఠినచిత్తయు, పాపియునగు మోహానను జండాల రాక్షసియని చెప్పినను బాపములేదుసుండీ.

రాగాద్యభినయములతో నాతని మన మాకర్షించుచు, శృంగార రతులం దేలించుచు, ప్రియతమునిగ నెంచి ప్రేమం జూపుచు, సుస్వాగతమిచ్చుచుండిన మోహాన కచ్యుతరావు నేడు దుష్టగ్రహముగఁ దోఁచుచుండెను. నెలకైదువందల మొత్తము నిచ్చుటకు సిద్ధముగనుండి ప్రస్తుతము వేయి రూప్యములిచ్చిననే మీరు నాయింటనుండ నర్హులని మోహాన నతివేగముగఁ బలికెను. మోహాన నోటనుండి వెడలిన క్రూరపు మాటలను విని యచ్యుతరావు గడగడ వడంకెను. మోహానా! ఏమీలాగు నిర్దాక్షిణ్యముగ మాటలాడెదవు? నీయీమాటలు నిక్కమా లేక నను బరీక్షించెదవా? నిజముగఁ జెప్పుము. మోహాన నిజముగనే జెప్పుచున్నాను సుండీ! యని కఠినముగఁ బలికెను.

అచ్యు — చెలియా? నీవిట్లు చరింతువని నేనెన్నడును దలఁప లేదు. నాయావదాస్తియు — కొంచెమా! దాదాపు అర్థలక్షకు నీకు సమర్పించియుంటినే. నీవింత కఠినముగ మాట్లాడెద వేల? నాజీవితమంతయు నీకడఁ గడుపనెంచి యుండిన నాకింతలో నీతొందరగల్గించుటఁజూడ నీవు మహాపరాధము నకు నయిత మొడిగట్టినట్లున్నదే? నీవింత కఠినముగ

వర్తింతువని గలనైన దలపకుండిన నాకిప్పుడిట్టి విషమదశఁ గల్పింపజూచుట భావ్యమా?విడియాకులిచ్చుట భావ్యమా? యని కనుల నశ్రుబిందువులు రాల నచ్యుతుఁడు మోహాన పాదములపైఁబడెను.

మోహాన తనపాదముల యెదుటఁ బడి దీనునివగిది నేడ్చుచుండు నచ్యుతరావును తనకాలితాకున నావలికి గెంటి వైచుచు నేమని యిచ్చితివయ్యా నీయాస్తి-పాస్తి? నాతోఁడి వేశ్యా తిలకములగుం నీలవేణియు, శారదాంబయుఁ గొలది కాలముననే యొక్కొక్కరు లక్షలారులు సంపాదించియుండ నేనొక సంవత్సరమంతయు నీకులొంగియుండి నీవిచ్చుయీకాసు వీసము లార్జించుట గొప్పయా? నా దురదృష్టముననే నీమైత్రి సీతారామచంద్రుఁడు గల్పించి నన్నింతకు దెచ్చెను. అచ్యుత రావునకు నోటమాటయే రాలేదు. అంతటనైనను పాపమాతని కామోహానను వదలనాశ జనింపలేదు. ఇఁకను గొన్ని లక్షలుం డిన నీమోహానతోఁ గాలముఁ గడుపవచ్చునే యని తలఁచి యైదువందల రూప్యములకన్న నెక్కువగ కిమ్మతు చేయఁగల తనవ్రేలియుంగరపు వజ్రాంగుళీయకమును, చేతియందలి బంగారు 'రిష్టువాచి' యు (wrist watch) తక్షణమేతీసి మోహానకొక వందనముగూడ నాచరించి తన్నుద్ధరింప వలసినదిగఁ గోరుచు సమర్పించెను. మోహాన ఆవస్తువులను ప్రేమపూర్వకముగ

స్వీకరించి కొంచెమభిమానముతో గొన్ని నాళ్ళుమాత్ర మాదరించి యిక నిలు వెడలవలసినదని తీవ్రముగ మందలించెను. మానసమున నైదువందల రూప్యములు శిస్తుచెల్లించుట కచ్యుతరావున కేమియాధారమున్నది? ప్రేమాస్పదయగు నిజసతీతిలకమువలె భావించియుండిన మోహన నెన్ని యోవిధముల వేఁడుకొనెనుగాని లాభమావంతయు గనపడమి నచ్యుతరావు మిగుల హతాశుఁడయ్యెను. కడసారి ముద్దిమ్మని యొద్దజేరఁబోయెను. మోహాంధకారమునఁ బడి మోహనా! నాముద్దుల మో... హా...నా యని దీనవదనుఁడై కౌఁగిలించుకొనఁబోయెను. ఏదీ యొకమారు మోహనా "తొలినేఁజేసిన పూజాఫలమో" యని పాడుమని వేడుకొనియెను. మోహన పాడకుండుటచే నచ్యుతరావు "తొలినేఁజేసిన పూజాఫలమో" యని పాడెను. పిచ్చి వానివలె నాడెను. ప్రపంచజ్ఞానమే లేక మోహప్రపంచమునఁ బడి మరల మోహనను సమీపించి యానుకొనఁబోయెను.

మోహన రాక్షసివలె గర్జించుచు, ఛీత్కరించుచు, నిక మర్యాదగ వెడలు జాగ్రతయని కఠినముగఁ బలుకుచు మెడబట్టి గెంటివైచెను. అచ్యుతరావిఁక నేమిసేయఁగలఁడు? కంటినీరు గార్చుచు మోహనా నీకిదే వందనమని చెప్పుచు పిచ్చివానివగిది పాడుచు మోహనా మందిరమును వదలుచు,

మ॥ చనుమానంబును జేరదీసి ధనముం సర్వంబు గాంజేసి లో
ననుమానింపక పారద్రోలుదురు సన్యాసంబు నిప్పించుచుం
ధనకాంతల్ మఱి లేవు వారికి దయాదాక్షిణ్యాధర్మంబులో
మనమా!వద్దిక బుద్ధిఁగల్గి ధనభామాసంగముఁ మానుమా!

యని మానస సంబోధనము గావించుకొనుచు భయ భ్రష్టుఁడై ఫకీరై ఆ పట్టణమం దెచ్చటికో బయలుదేరి పోయెను.

---

## చతుర్దశ తరంగము.

అచ్యుతరావు దారిద్ర్యదేవతకు వశుఁడైపోయెను. చేత గాసులేదు. వాసముచేయ నిల్లులేదు. తిన నన్నములేదు. ఏమి చేయఁగలఁడు? భిక్షాటనమునఁ గొన్నాళ్ళు గడపెను. ఒకనాఁటి సాయంతనము తిరువళ్ళిక్కేణి పార్థసారథి కోవెలయందలి పుష్క రిణి గట్టున గూర్చుండి తనదుఃఖ మినుమడింప నేడ్చుచుండెను. తనతల్లిని, సోదరిని గాంచుటకుఁ గూడ దనకు బుద్ధిపుట్టలేదు. తోడివిద్యార్థులఁ జూతమన్నను దనకు భయమగుచుండెను. పూట గడుచుటయే గండమ్ముగనుండెను. పాపమాతని కేల యిట్టి యవస్థ? అచ్యుతరావా కోవెలకు వచ్చువారిని యాచించి వారిచ్చుకాసులు జిక్కిన దానికన్నముఁగొని తిని ప్రాణము బిగ్గ పట్టుకొని యుండెను. ఆహా!ఏమి కాలమహిమ! అగర్భశ్రీమంతు

నికిఁ దనయుఁడై యగ్రజన్ముఁడై వివేకశాలియని పేరంది పట్టపరీక్షలయందు తీర్ణుఁడగుటకు సిద్ధముగనుండిన యచ్యుతరావున కావేశ్యాసంపర్కముచే నెంతటిదుర్భరావస్థ సంప్రాప్తించెనోఁ జూడుఁడు. తన సర్వస్వమును గోలుపోయి పిచ్చివాఁడై తిన నన్నముగూడలేక దేవులాడుచున్నాఁడుగదా!

చెన్ననగరమందెందరెందరో తన్నాదరించఁగల విద్యార్థులున్నను వారికడకేగఁ దనకు మనస్సొల్లకుండెను. పిచ్చివాఁడైపోయిన యచ్యుతరావునకు, రాజకీయోద్యోగము నిత్తురా? అట్టి త్రోవయు గనపడకుండెను. తానిఁక బ్రతుకుటెట్లో యను చింతయే యాతని బాధించుచుండెను.

"శ్రీకృష్ణా! నా జీవితమెంత నీచమైపోయినది. నేనెంతటి బాపుఁడనై యుంటిని. ఆఁకలియని యన్నవారికెందఱకో యన్నముఁ బెట్టించియుంటినే. యుక్తవయస్సున నుండినను నా జననీజనకుల యాజ్ఞ శిరసావహించుచుఁ గళాశాల కార్యక్రమములందు మనసును జొరనిచ్చియుంటినేగాని పరకాంతను గన్నెత్తియైనఁ జూడలేదే? నా గ్రామవాసులే గాక నాతోడి విద్యార్థులును, నాయొజ్జలును గూడ నా విద్యాపటిమకు మెచ్చి నను గౌరవించుచుండిరే! ధనికునకు దనయుండనై తినని మురియుచుంటినే! కాముకీ జనసంబంధ మీసుమంత.

శ్యైన నెఱుంగని నాకా మాయదారి యగు సీతారామ చంద్రుని పొత్తుగదా యిన్నితిప్పలు దెచ్చిపెట్టినది? నేనవి వేకినైగదా వానికిఁ జోటిచ్చితిని? వాఁడెంతయో ప్రార్థించి మోహనా సందర్శనము గలిగింప నుద్యమించి నాకు స్త్రీ వర్ణనా కర్ణనా కౌతుకమును గల్పించి యారాక్షసి, నిర్దా క్షిణ్యా జన్మవిషపూరిత, కులటయగు నా మోహనా సందర్శ నము గల్గించి నన్నింతిగష్టములపాలు జేసెను. సీతారామ చంద్రా! నీకు దైవము తోడగునా? మోహనా! నీకు పుట్ట గతులుండునా? నాతండ్రిని ధారవోసికొంటిని. నా సర్వ స్వము నీ కర్పణజేసితిని. నా జననిని వనవాస మంపితిని. అకటా! ఏమి నాకీదురవస్థ! తలఁచికొనినఁ గడుపు భగ్గున మండిపోవుచున్నదే. దేశీయులారా! విద్యార్థి సోదరులారా! మీరా వేశ్యల కెఱగాకుఁడు. చూచితిరా! నే నెన్నియిడుమల బడుచున్నానో? వేశ్యాసంఘమెంతటి కూ్రరసంఘమో! నావలె నెన్ని కుటుంబములు నాశనమైనవోగఁదా యీ దేశమున!

వేశ్యామతల్లులారా! మీరేల యింతపాపమున కొడి గట్టుకొనెదరు. మీరందఱు స్వాసారికవృత్తి నవలంబించిన సంతసించునుగదా మనదేశమాత! ననుంబోలు యువకులు మీకు బలిగాక దక్కుదురు గదా? సంఘ సంస్కరణాభి మానుల్లారా! ఈ ఘోరమగు వేశ్యావృత్తి మొదలంట నిర్మూ

లింపఁగూడదా? అబ్బ! వేశ్యలన్న భయమగుచున్నది. భర్తృహారీ! నీవలుకు లెందుకు వమ్మగును? అనుభవపూర్వకములైన సుభాషితములు గావా యవి? ఔరా! వేలసంఖ్యయే? నలువదివేలు! ఎన్నాళ్ళార్జించిన నంత మొత్తమగును? ఒక్కపూట దిండికి సంపాదించుకొందమన్నఁ గష్టముగ నున్నది గదా! సోదరులారా! వేశ్యపొత్తువలన నే నింత ప్రమాదమునం జెందితిని. నా చరిత్రమింక నావంటి యువకులు నాశమందకుండ నాదర్శప్రాయముగ నుండుఁగాక! హా దైవమా! యెట్టిగతి! యని యచ్యుతుఁ డనేకవిధములఁ బలవించుచుండెను.

---

## పంచదశ తరంగము.

నాఁడు పార్థసారథి కోవెలయందు గరుడోత్సవము. వేలకొలఁది భక్తులు వచ్చుచుండిరి. అందేమాత్ర మెడతెఱపి లేక ప్రజలు పార్థసారథిస్వామి సేవకై వేచియుండిరి.

ఆవచ్చిన వేలకొలదియాత్రికులలో నొక్కరుమాత్రము మన యచ్యుతరావు యావేటనమంతయు పుష్కరిణి వెనుక గట్టుననుండి గమనించుచుండినందున దటాలున నచ్యుతరావుంజేరి యోదార్పసాగెను. అప్పుడా యచ్యుతుని నేత్రములనుండి యశ్రుబిందువులు వెల్లువలై పాఱఁజొచ్చెను.

అచ్యుతరావు స్థితింజూచి యా నూతనపురుషుడును జింతించు చుండ దనకండ్లనుండియు వేఁడిబిందువులరాల్చెను. అచ్యుతరావానూతన పురుషుంగాంచి కులశేఖరముగారూ! క్షేమమా? యని హీనస్వరమునఁ బ్రశ్నించెను.

"క్షేమముగ నుంటినిగాని నీవింత కష్టములకు గుఱి యగుదువని నేనెన్నఁడును దలఁచి యుండలేదు." అచ్యుతరావు కొంచెముగ దెప్పిరిలెను.

తోడనే కులశేఖర మాతనిని (సంగతులు వెనుక నడుగఁదలఁచి) కోవిలకు సమీపముననే యున్న తనబసఁజేర్చి యన్నపానాదులొసంగెను.

కులశేఖరముగా రెవరు? మనకిదివఱకు పరిచయుఁడైన యచ్యుతరాయుని సహాధ్యాయి. ఆతఁడుక్రమక్రమముగఁజదివి పరీక్షలయందు కృతార్థుఁడై కొన్నాళ్ళక్రితమే డిప్యూటికలెక్టరు హూదా నంది కర్నూలు మండలమున నివశించుచుండెను. కార్యార్థముగఁ జెన్నపురమునకు వచ్చియుండి యచ్యుతరావు నదృష్టము సమీపించి కాఁబోలు నాఁడే కోవెలకడ నచ్యుత రావును గనుగొనియెను. అచ్యుతరావు యావద్వృత్తాంతము విపులముగ కులశేఖరమున కెఱింగించెను. కులశేఖరమా యుదంతము విని దిగులువడెను.

నాఁటి యీనూతన మిత్రుఁడా యింతపనిఁజేయ నిన్ను బురికొల్పినది? ఆహా! అచ్యుతా ! నీవంత బేలవైపోతివా? వారకాంతా విలాసములకా నీ సర్వస్వమును గోలుపోయితివి. నీకై నెన్నియోమార్లు నీబసయొద్దకు వచ్చియు హతాశుఁడనై పోవుచుంటిని.

నీజనకుఁడు పరమపదించినట్లును, నీవు చదువు మాని యూరనుండులాగునను వినియుంటిని. నేఁటి నీచారిత్రమువినిన గుండెలవియుచున్న వే ! వేశ్యా సంపర్కముచేఁ గలుగు కష్టములు మీరీవరకు వినియుండిన నాచెడ్డ కార్యమునకు దిగి యుండరు. ఈ మాటలకు మాఱుపలుకక నూఱక బేలయై యచ్యుతరా వేడ్చుచుండెను. ఇఁక నెక్కుడుగ మందలించుట యుత్తమముగాదని తలంచి తన చారిత్రమంతయు విపులముగఁ జెప్పెను. తాను డిప్యూటీకలెక్టరైనవార్త వినినదే ముదమందుచు నచ్యుతరావెంతయో తనగతికిఁ జింతించుచు భగవానుఁడా! యెంత కూరదృష్టిఁ జూచితివి? యని నిట్టూర్పువిడిచెను.

అచ్యుతా ! నీవింకను గళాశాల యందుండిన నాకన్న నెన్నియో మడుంగులు నీయభివృద్ధి మీఱియుండునుగదా? ఆస్తి యంతయు పోయినదటుండ నీవిద్యావిధానమును భంగ మందినదని వినుటకు నేనెంతయో విచారించెదనని కులశేఖరుఁడు పలికెను.

కులశేఖర మచ్యుతరావును జక్కఁగ నాదరించి నతనిని యభివృద్ధికిఁ దేవలయునను నూహ నాతనికించుకఁ బోడ నూపెను. మఱుదినమే కళాశాల యందాతనిఁ జేర్పించెను. ఆతనికగు ఖర్చులన్నియు తానే భరించుచుండెను. మూఁడవ వత్సరమునకంతయు న్యాయశాస్త్రమునందు (బి. ఎ. బి. యల్) రాజధానికంతయు బ్రథమముగ గడతేర్పించెను. మితిలేని కష్టము లనుభవించిన వాఁడగుటచే నచ్యుతరావు స్నేహితుఁడగు కులశేఖరము విద్యార్థివేతనముచే సునాయాసముగఁ గృతార్థతఁ జెందెను.

ఇదిగదా స్నేహము! ఆపత్సమయమున కులశేఖరము తన్నుద్ధరించినఁగదా యచ్యుతరావు మరల ప్రపంచమున సంచరింపఁ గలిగెను? అచ్యుతరా విప్పుడు సంఘసంస్కరణోద్యమాభిమానియై వేఱొక బ్రాహ్మణశాఖయందు యుక్తమగు కన్యను బెండ్లియాడి వేశ్యావృత్తి మొదలంట నూడఁబెఱుక దీక్ష వహించి పనిఁజేయుచు, రాజమహేంద్రవరమున న్యాయవాదవృత్తి నవలంబించి వేనకువేలు ధనమార్జించుచు దేశహితైకకార్యములకుఁ దోడ్పడుచు, కులశేఖరమును దైవసమానునిగఁ దలఁచి పూజించుచు జీవయాత్రఁ గడపుచుండెను.

వారకాంతల సుందరవదనములం జూచి భ్రమించు పూరుషాళికీ చిన్నిగ్రంథము నీతిమార్గ ప్రదర్శకమగుఁగాక!

---

